# దశమహావిద్యలు

రచన

దేవరకొండ శేషగిరిరావు



ఋషిపీఠం ప్రచురణ

**దశమహావిద్యలు**

దేవరకొండ శేషగిరిరావు

**ద్వితీయ ముద్రణ:** శ్రీక్రోధి అశ్వయుజం
అక్టోబరు - 2024

**వెల: రూ. 100 /-**

**ప్రచురణ:**
ఋషిపీఠం చారిటబుల్ ట్రస్ట్
**Rushipeetham Charitable Trust(Regd)**

**ముఖచిత్రం:** రాము. పి

**రూపకల్పన:** విట్టుబాబు

**ప్రింటర్స్:** ప్లానెట్ గ్రాఫిక్స్, హైదరాబాద్

**ప్రతులకు:**
ప్లాట్ నెం. 37-93/138/2
మధురానగర్, నేరేడ్‌మెట్,
హైదరాబాద్ - 500 056. తెలంగాణ
ఫోన్: 040-79658274
e-mail: info@rushipeetham.org | Website: www.rushipeetham.org

# ఆత్మవిద్యా మహావిద్యా...



'మహా' శబ్దానికి 'పరబ్రహ్మ' అనే అర్థాన్ని వేదశాస్త్రాలు చెప్తున్నాయి. 'మహావిద్య' అంటే బ్రహ్మవిద్యయే. 'విద్య' అంటే 'తెలియజేయునది' అని, 'మంత్రం, ఉపాసన' అని అర్థాలున్నాయి. బ్రహ్మమును తెలియజేయునది, బ్రహ్మమును ఉపాసించు మంత్రవిజ్ఞానము... అని అర్థాలను గ్రహించాలి. ఇదే 'మహావిద్య'.

ఆగమాలు బోధించే మహావిద్యలు, నిగమాలు(వేదాలు) నుడివిన ఉపనిషల్లక్ష్యాన్ని సాధించే ఉపాసనా మార్గాలే. "ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీవిద్యా" అని లలితాసహస్రం పేర్కొన్నది. 'సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా' అని కూడా వక్కాణించింది. సిద్ధమైనది బ్రహ్మమే. మహావిద్యలకి సిద్ధవిద్యలని కూడా పేరు.

ఈ పది మహావిద్యలలోను ఒకే పరబ్రహ్మరూపిణి వ్యాప్తమై ఉన్నది. 'దశ' సంఖ్య పూర్ణత్వానికి, ఏకత్వానికి, వ్యాపకత్వానికి సంకేతం. పది(10) అనే సంఖ్యలో బహుత్వమున్నా, సున్నను తొలగించితే, (సున్నను కలిపినా) మిగిలేది ఏకత్వమే. 'ఏకోహం బహుస్యామ్' అనే పరమేశ్వరుని ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మక శక్తియే విశ్వవ్యాపకం – అది కాలస్వరూపమై సృష్టిని శాసిస్తూ, నియమిస్తూ, నడిపిస్తూ తన అఖండ విభూతులతో 'కమలాత్మిక'గా వికసితమై, వ్యాప్తమై ఉన్నది. ఈ అంతరార్థం దశమహావిద్యా విజ్ఞానం. వీటిలోని ఉపాసనా పద్ధతులు, మంత్రములు, దేవతా మూర్తులు, యంత్ర విశేషాలు... అన్నీ ఆత్మశక్తి విలసనాన్ని అవిష్కరించేవే.

ఈ ఆవిష్కరణను అద్భుతమైన దర్శనశక్తితో అవగాహన పరచిన శ్రీ **దేవరకొండ శేషగిరిరావుగారు** ఉపాసకులకు ఈ కృతి ద్వారా మహోపకృతి గావించారు. తెలుగువారిలో ఇంతటి ప్రతిభామూర్తిని గుర్తించినవారు చాలా అరుదు. బహుశాస్త్రవిజ్ఞానం, వాటిని సంప్రదాయబద్ధంగా సాత్త్విక-తాత్త్విక రీతిలో సమన్వయించడం వీరు తమ రచనల ద్వారా గావిస్తున్న మహాయజ్ఞం.

ఈ మహానుభావుని 'దశమహావిద్యల'ను దశదిశలా వ్యాపింపజేసి, భారతీయమైన ఉపాసనాభావ వైశిష్ట్యాన్ని చాటించాలనే సత్ సంకల్పంతో 'ఋషిపీఠం' ఈ సద్గ్రంథం రెండవముద్రణను కూడా వెలువరిస్తోంది.

సామవేదం షణ్ముఖ శర్మ.



**పూర్వాశ్రమంలో కవి కులపతులుగా, డా॥ ప్రసాదరాయకులపతిగా ప్రసిద్ధి పొందిన ప్రస్తుతం కుర్తాళం, సిద్ధేశ్వరీ పీఠాధిపతులు**

# జగద్గురు శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామివారి

## ఆశీస్సులు

సహృదయులు, సాహిత్య సత్యవ్రతులు – శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు రచించిన దశమహా విద్యలు – అనే గ్రంథాన్ని చూచాను. వారు స్వయంగా కొంత వినిపించారు కూడా. వారు చేసిన కృషి నాకెంతగానో నచ్చడం చేత ఆ విషయాల మీద ఇక్కడ కాళీపీఠంలో వారి ఉపన్యాసం కూడా ఏర్పాటు చేయించాను.

ఈనాడు వారి గ్రంథం ప్రచురింపబడటం చాలా ముదావహం. శాక్తేయ విద్యలలో అభిరుచి గలవారికి ఇది ఎంతో ఉపకరిస్తుంది. ఎన్నో విషయాలు తెలియజేస్తుంది. ఈ విద్వత్కవికి పీఠదేవత శుభములు ప్రసాదించాలని భావిస్తున్నాను.

నారాయణ స్మృతితో<br>
సిద్ధేశ్వరానందభారతీస్వామి

# కృతజ్ఞతాంజలి

ఈ రచనకు ప్రధాన ఆధార గ్రంథం, ఆంగ్లంలోని "The Ten Great Cosmic Powers". దానిని ప్రసిద్ధ రచయితలు, గొప్ప సాధకులైన ఎస్. శంకరనారాయణన్‌గారు రచించారు. అనేక భాగాలను అనువదించడానికి అనుమతిని ప్రసాదించిన శ్రీవారికి సాష్టాంగ నమస్కారములు. అది లేకపోతే ఈ రచన ఇట్లా సాగి ఉండేది కాదు.

దానికి తోడు శ్రీ గుంటూరి లక్ష్మీకాంతం గారి తెలుగు సేతతో కూడిన వాసిష్ఠ గణపతిమునుల 'మహావిద్యాది సూత్రావళి', అట్లే వారి ఉమాసహస్రం; సర్ జాన్ వుడ్రాఫ్ రచనలు, లలితా సహస్రనామభాష్యం, శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి శ్రీచక్ర విలసనం, కొన్ని కృష్ణయజుర్వేద మంత్రాలు, అథర్వవేదంలోని కాలసూక్త, ప్రాణసూక్తాలు, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులు తోడ్పడ్డాయి.

ఛిన్నమస్త స్వరూపులు, పూర్వాశ్రమంలో డా॥ ప్రసాదరాయ కులపతిగా ప్రసిద్ధి పొందిన ప్రస్తుత కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులైన జగద్గురు శ్రీసిద్ధేశ్వరానందభారతీస్వామివారు ఇందలి ప్రతి అక్షరాన్ని చదివి ఆశీస్సులనందించారు. వారికి కృతజ్ఞతాభివందనములు.

–దేవరకొండ శేషగిరిరావు

ఓం
శ్రీమహాగణాధిపతయే నమః

ఒక వేదవిద్వాంసుడుండేవాడు. పౌరోహిత్యంతో జీవనం గడిపేవాడు. పొట్ట గడవక ఏదైనా మంత్రాన్ని పురశ్చరణ చేశాడు. రెండు గంటలు గడిచిందో లేదో ఒక బిచ్చగత్తె ముంగిట కూర్చుంది. జపంలో ఉండడం వల్ల ఆమెను అదిలించలేదు. ఆమె సంచి విప్పి సేకరించిన నాణేలను ఇతని పాదంపై క్రుమ్మరించింది... "నీకు కావలసింది ఇదే కదా!" అంటూ వెళ్ళిపోయింది. పురోహితుడు నిర్ఘాంతపడి మంత్రాన్ని ఆపివేసి తేరిపార చూశాడు. ఇక ఎప్పుడూ అట్టిపని చేయలేదు.

ఎందుకీ కథ చెప్పవలసిందంటే... ఇది తాంత్రికోపాసనకు చెందింది. ఉన్నతలక్ష్యంతో కాక క్షుద్రప్రయోజనం కోసం క్షుద్రదేవతను ఆరాధించాడు. అనగా పరిమితశక్తిని ఆరాధించాడన్నమాట.

మహోపాసనలతో బాటు ఈ క్షుద్రోపాసనలూ ఉంటాయి. ఇది అనాది నుండి సాగుతున్నదే. అందరూ ఉన్నతభూమికలను చేరుకోలేరు. చాలామందికి కావలసింది భౌతికవాంఛలను తీర్చుకోవడమే. మామూలు జనాలకు తమ తమ కోరికలు తీరుతూ ఉంటే ఒకనాటికైనా ఉన్నతలక్ష్యానికి సాధకుడు చేరుకుంటాడనే లక్ష్యంతోనే ఉచ్ఛ-నీచ ఉపాసనలు ఏర్పడ్డాయి. నీచోపాసనలతో సాధన ముగిస్తే వాడిగతి అధోగతే. సాత్త్విక, రాజసిక, తామసిక ప్రవృత్తులు కలవారుంటారు గదా! క్రమక్రమంగా సాత్త్విక ప్రకృతిని అలవరచుకుని అఖండానందాన్ని అనుభవించండని చెప్పడమే తంత్రోపాసన లక్ష్యమైంది.

కేవల క్షుద్రోపాసన చేసిన వారి జీవితాలను చూస్తున్నాం, వింటున్నాం, కాని బెడిసికొట్టిన జీవితాలు కోకొల్లలు. తాత్కాలిక సిద్ధులతో ధనం, కీర్తి, ప్రతిష్ఠలు సంపాదించినా వారి వారి జీవితాలలో అనేక కష్టపరంపరలకు లోనౌతున్నారు. కానిఉచ్ఛదేవతోపాసన అట్లాంటిది కాదు. క్రమక్రమంగా సాధకునిలో పరిణతిని తీసికొని వచ్చి పరబ్రహ్మ సాక్షాత్కారానికి దోహదం చేస్తుంది. ఉపనిషత్తులలో చెప్పిన నిర్గుణబ్రహ్మ ఉపాసనకు దారి చూపిస్తుంది. ఈ దేవతలనే మహావిద్యలని అంటారు. అసలు విద్య అనే మాటకే 'తెలిసికొనుట'యని, 'తెలుసుకొనుమార్గాన్ని చెప్పే'దని అర్థాలున్నాయి కదా!

ఇవి గురు-శిష్యపరంపరతో సాగుతాయి. గుప్తంగా ఉంటాయి. ఉపనిషత్తులు కేవల జ్ఞానాన్ని ప్రసాదించేవే కావు. అనేక సాధనామార్గాలను అందించాయి. ప్రసిద్ధ

దశోపనిషత్తులలో అనేక విద్యలున్నాయి. అనేక ఉపాసనలున్నాయి – మధువిద్య, సంవర్గ విద్య మొదలైనవి. వాటిని చదవడంతోనే సరిపెట్టుకొంటున్నాం. సాధన ఏనాడో కనుమరుగైంది. ఆ విద్యలే తంత్రాలలో మహావిద్యలుగా రూపాంతరం చెందాయి.

వాటినే కాళి, తార, త్రిపురసుందరి, భువనేశ్వరి, త్రిపురభైరవి, ఛిన్నమస్త, ధూమావతి, బగళాముఖి, మాతంగి, కమలాత్మిక–లని అంటారు. ఉపనిషత్ విద్యలకు – ఈ తంత్రవిద్యలకు అభేదాన్ని ఘటించి అనుభవంతో జోడించి ఇచ్చిన మహామనీషి, సిద్ధపురుషుడు కావ్యకంఠ గణపతిముని. ఇది పూర్వులెవ్వరూ చేయని పని. వారి సమన్వయాన్ని ముందు ముందు అందిస్తా.

"ఇవి పదిగానే ఎందుకుండాలి? అఖండశక్తికి సృష్టి చేయాలనే సంకల్పం కలిగింది. ఆకాశ–కాలాలను ఆలంబనంగా చేసికొంది. ఆకాశానికి అవధి లేకపోయినా పది దిక్కులలో ఆవరించియున్నట్లు కన్పిస్తుంది. అవే పది దిక్కులు. అనంతశక్తిగా కూడా పది రూపాలను ధరించింది. ఆ పైన విజ్ఞానమొక్కటే. చైతన్యం ఒక్కటే. ఆ విజ్ఞానము పది మార్గాల ద్వారా అందుతోంది. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు కలిపి పదింటి ద్వారా విజ్ఞానం అందుబాటులో ఉంది. అట్లాగే అనంత సత్యమూ దశమహావిద్యల ద్వారా, దశ మహారూపాల ద్వారా అవగతమౌతోంది.

ఈ దశమహావిద్యల ఉత్పత్తికై పురాణాలను పరికిస్తే కొన్ని సంగతులు తెలుస్తాయి. సతీదేవి భయంకర రూపాన్ని చూసి శివుడు పారిపోతూ ఉంటే అమ్మవారు పదివిద్యల రూపాన్ని ధరించి అతనిని అడ్డుకొందని భాగవతం అంటోంది.

దుర్గముడనే రాక్షసుడు వేదాలను దొంగిలించగా పదిరూపాలు ధరించి అసుర సంహారం చేసిందని, అవే ఈ విద్యలని శివపురాణ వచనం.

పది మహావిద్యలు బ్రహ్మవిద్యకు సంబంధించినవే. ఇహపరాలను సాధించిపెట్టేవే. పరమ పురుషార్థమే అంతిమమైన మెట్టు అయినా తన ఇష్టమైన కోర్కెలను సాధకుడు తీర్చుకోవడంలో తప్పుపట్టనవసరం లేదు. కనుక భోగ–మోక్షాలను రెంటినీ ప్రసాదించేవి ఈ విద్యలు. ఇది వీటి ప్రత్యేకత. ఇదే తంత్రాల ప్రత్యేకత. ఒకొక్క కోరికా తీరుతూ ఉంటే సాధనలో రుచి మరగి కోరికలే లేకుండా ఆమె కృపాకటాక్షానికి అఱ్ఱులు చాస్తాడు. ఇట్లా సాధనకూ–సాధ్యదేవతకూ ఒక అనితర సంబంధం ఏర్పడుతుంది. సిద్ధులు తమంతట తామే వస్తాయి.

ఈ విద్యలు ప్రసాదించే ఆత్మసాక్షాత్కారం సాధకుని తీవ్రతను బట్టి, భక్తిశ్రద్ధలను బట్టి ఉంటుంది. మార్గమధ్యంలో సాధకుడు ఆగినా అపకారం ఉండదు. కాని లక్ష్యాన్ని మాత్రం వెంటనే అందుకోలేడు. సాధనలో అనేక ఆటంకాలు ఎదురౌతాయి. సహజంగా ఉండే కామక్రోధాలు, అహంకారం ఆటంకాలను కలిగిస్తాయి. ఈ జన్మలో సాధించలేకపోయినా మరో జన్మలోనైనా సాధిస్తామని మన నమ్మకం. ఈ నమ్మకమే మానవుని ఆశాజీవిగా తీర్చిదిద్దుతోంది. సగం కాలిన కట్టె మరునాడు ముట్టిస్తే మిగిలిన భాగం కాలుతోంది కూడా. కట్టె మొదటి నుండి కాలడం లేదు కదా! అదే సూత్రం సాధనలోనూ. చేసింది ఏదీ వ్యర్థం కాదు. అసలు గతజన్మలలో కొంత సాధన చేస్తేనే ఈ జన్మలో మహావిద్యల సాధనకు ఉపక్రమిస్తాడని తంత్రాలే అంటున్నాయి..

ఈ విద్యలకు అంతిమ గమ్యమొక్కటైనా... అన్నీ ఒకటి కావు. ఒకొక్క విద్యకు ఒకొక్క ప్రత్యేకత, విశిష్టత ఉన్నాయి, కాళి యొక్క శక్తి, తార యొక్క నాదశక్తి, సుందరి యొక్క అతిలోక సౌందర్యము, భువనేశ్వరి యొక్క అనంత దర్శనము, భైరవి యొక్క దేదీప్యమానమైన మనోహరత్వము, ఛిన్నమస్త యొక్క ఆశ్చర్యకరమైన శక్తి తీవ్రత, ధూమావతి యొక్క స్తబ్ధత, బగళాముఖి యొక్క స్తంభన శక్తి, మాతంగి యొక్క భావప్రకాశక శక్తి, కమలాత్మిక యొక్క ఒద్దిక, అవయవ సంగతి భిన్నమైనవే. అన్నీ సృష్టికి దోహదం చేసేవే. ఒకొక్క శక్తినీ ఆరాధించవచ్చునీ అన్నీ ఒకే లక్ష్యానికి దారితీస్తాయని చెబుతున్నాయి. సాధకుని అభిరుచిని బట్టి ఒకొక్క సాధనను ఎంచుకుంటాడు. ఒక నదిలో స్నానం చేయదలుచుకుంటే నది అంతటిలోనూ ఒకేసారి స్నానం చేస్తున్నాడా? అట్లాగే ఒకొక్క దేవత ఉపాసన కూడా!

ప్రవాహమే ఒకచోట మందంగా, ఒకచోట తీవ్రంగా ఉంటుంది కదా! వర్షకాలంలో ఉరవళ్ళు, పరవళ్ళు త్రొక్కుతోంది. అదే వేసవిలో మరొక విధంగా ఉంటోంది. కాశిలో అనేక స్నానఘట్టాలున్నాయి. ఏ ఘట్టంలో చేసినా గంగాస్నానఫలం దక్కుతోంది. అట్లాగే ఏ దేవతను ఉపాసించినా సంపూర్ణఫలం దక్కుతోంది. విడిగా ఒక దేవత అని పేరుపెట్టినా అదీ పరదేవతే.

ఈ విద్యలు సమన్వయాన్ని సాధిస్తాయి. ఒక మహావిద్య మరొక విద్యాసాధనకు దారి చూపిస్తుంది. కాళి భయంకరంగా ఉన్నా భద్రకాళిగానూ ఉంటుంది. అట్లాగే త్రిపురసుందరికి–త్రిపురభైరవికి సంబంధం ఉంది. అందమైన రూపంలో త్రిపుర సుందరి,

భయంకర రూపంలో త్రిపురభైరవి. త్రిపురసుందరీ విద్యలో ఆమె మంత్రిణి, దండనాథలకు పూజ ఉంది. వీరిద్దరూ పరివారవర్గానికి చెందినవారు. శ్యామలయే మంత్రిణి. ఆమెయే మాతంగి. సుందరియొక్క దండనాథ బగళాముఖి. కనుక త్రిపురసుందరీ ఉపాసకుడు మిగిలిన మాతంగి, బగళాముఖి విద్యలను ఉపాసిస్తున్నట్లే.

త్రిపురసుందరీ విద్యలో మాతంగి, బగళాముఖి విద్యలుండుటచే త్రిపురసుందరి విద్య గొప్పదని, మిగిలినవి రెండు తక్కువని భావించరాదు. ప్రతివిద్య – దేనికది గొప్పదే. ఎక్కువ, తక్కువలెంచకూడదు. కొన్ని సాధనలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. కొన్నింటికి తక్కువ ప్రచారం ఉంది.

ఈ విద్యలలో కొన్ని సామాన్య లక్షణాలున్నాయి. కాళి, ఛిన్నమస్త, ధూమావతి, బగళాముఖి ఒక కోటికి చెందినవి. శక్తి, పరాక్రమం, చలనం ప్రచ్ఛన్న దశలకు చెందినవి. ఇక సుందరి, భువనేశ్వరి, భైరవి, మాతంగి, కమలాత్మిక, – కాంతి, సౌందర్యం, రమణీయం మొదలైన గుణాలకు చెందినవి. నాదశక్తిని వ్యక్తీకరించడంలో తారాదేవి కొన్ని కాళీ లక్షణాలతో, కొన్ని భైరవి, బగళాముఖి, మాతంగి లక్షణాలతో ఉంటుంది. ఇట్టి మహావిద్యలు మూడు వర్గాలుగా కన్పిస్తాయి. వేదమే ముగ్గురు దేవతలను చెప్పింది కదా!

**తిస్రో దేవీర్మయో భువః**

పుట్టని ఏక మహాశక్తి ఎరుపు, తెలుపు, నలుపు వర్ణాలతో ఉంటుందని ఉపనిషత్తు వర్ణించింది కదా!

**అజామేకాం లోహిత శ్శుక్ల కృష్ణాం**

కాళి నల్లగా, తార తెల్లగా, సుందరి ఎర్రగా ఉంటుందని తంత్రాలు వర్ణించాయి. అనాది నుండి ఈ విద్యల ఉపాసన ఉంది. దక్షిణ దేశంలో త్రిపురసుందరి ప్రబలంగా ఉండగా, టిబెట్టు, కాశ్మీరు ప్రాంతాలలో తారోపాసన ఉండగా, బెంగాల్, అస్సాం ప్రాంతాలు కాళీ ఉపాసనకు పట్టం కట్టాయి.

స్త్రీదేవతాకమైనవి విద్యలు, పుందేవతాకమైనవి మంత్రాలను వచనాన్ని బట్టి ఈ విద్యలను గురించి తెలుసుకుందాం.

**ఇక చివరిమాట**

అదితి, ఉషస్, మహి, రాత్రి, ద్యౌ, ఇడా వంటి ఋగ్వేద దేవతాశక్తులు గాని, ఆకూతి, అనుమతి, జామి, గ్రాహి, రోహిణి, శచి, ఇంద్రాణి, రాకా, ఆపోదేవి, శ్రద్ధా,

సీత, యామిని, వైశ్వానరి, వసుపత్ని, వరుణాని వంటి అథర్వవేద స్త్రీ దేవతలను లేదా దేవపత్నులను నేడు కొలవకపోయినా ఈ దశామహావిద్యా రూపాలతో కొలుస్తున్నాం.

ఎందుకన్నానంటే వేదంలోని దేవతల విశేషణాలను బట్టి ఈ నిర్ణయానికి రావచ్చు. వేదదేవతలిట్లా కీర్తింపబడ్డారు. భగవతి, దేవి, సుభగ, అనవద్య (దోషం లేనిది), సరూపంకరణి (అందమైన రూపాలనిచ్చేది), శివ (మంగళం) శక్తి, మాత, పయస్వతి (పాలనిచ్చేది), ఊర్జస్వతి (బలాన్నిచ్చేది), అజర (ముసలితనం లేనిది), విశ్వరూప (అనేక రూపాలను ధరించేది), సుమన, సుమంగళి, జనిత్రి (పుట్టించునది), ఆయుష్మతి (దీర్ఘ జీవనాన్నిచ్చేది), తప్యమాన (తపస్సు చేసేది), సంవిదాన (తెలుసుకొనేది), కృష్ణ (నల్లగా ఉండేది), వీరవతి (వీరులను కనేది), పునీత (పవిత్రమైనది), యశస్వతి, అపరాజిత, మహీయసి, పురాణి, మధుమతి, పరమేష్ఠిని, రోచమాన, అంబ, అమృత, దివ్య వంటి విశేషణాలతో, నామాలతో ఆ వేదస్త్రీలు లేదా దేవతాస్త్రీలు కీర్తింపబడ్డారు. ఈ విశేషణాలు, ఈ నామాలు ఈ దశమహావిద్యలకూ వర్తిస్తాయి.

విజ్ఞానదాయిని తార, బలదాయిని కాళి, ఆనందదాయిని సుందరి... ఈ దేశాన్ని రక్షించుగాక.

## అనుక్రమణిక

క్రీం

# మహాకాళి

సంస్కృతంలో కాలః పుంలింగం. కాళి స్త్రీ లింగం. కాలమే కాళి. కాల స్వరూపం తెలిస్తే కాళి గోచరిస్తుంది. కాళీ చరణాలను సేవిస్తే కాలం తెలుస్తుంది.

దిక్– కాలాలు నిత్యసత్యాలా? వీటికి ఆది, అంతం ఉన్నాయా? సృష్టికి ఆది ఉందా? దిక్–కాలాలు తమంతట తాము‌న్నాయా? వీటికి ఆధారం ఎవరు?... అనే ప్రశ్నలు తాత్త్వికుల్ని ఊపివేశాయి. అసలు కాలమంటే?

అథర్వవేదంలో 19వ కాండలో ఆరవ అనువాకంలో ఎనిమిదవ సూక్తం కాలాన్ని విపులంగా చర్చించింది.

**పూర్ణః కుంభోధికాల ఆహితస్తం వై పశ్యామో బహుధానుసంతః**
**స ఇమా విశ్వా భువనాని ప్రత్యఙ్ కాలం తమాహుః పరమేవ్యోమన్**

**తా:** కాలం పూర్ణరూపమైంది. కుంభంతో సమానం. కుండలో నీళ్ళు పోసి నీటిలో ముంచితే కుండలోనూ నీళ్లున్నాయి. బైట కూడ నీళ్లున్నాయి కదా! అట్లాగే కాలం లోపలా, బయటా వ్యాపించి ఉంది. పగలు, రాత్రి, నెల, సంవత్సరం రూపంలో ఉన్న కాలం మన అనుభవ రూపంలో ఉంది. ఈ పుట్టిన కాలానికి ఆధారం పరమకాలం. అది అన్ని భువనాలనూ ఆవరించి ఉంది. అది ఆకాశం మాదిరిగా దేనికీ అంటకుండా, స్వస్వరూపంలో ఉంటుందని విద్వాంసులంటున్నారు. దానిని శ్రవణ –మనన–నిది –ధ్యాసల ద్వారా తెలుసుకొంటున్నారు.

**స ఏవ సంభువ నాన్యాభరత్ స ఏవ సంభువనాని పర్యైత్**
**పితాసన్నభవత్ పుత్రా ఏషాం తస్మాద్ వై నాన్యత్పరమస్తి తేజః**

**తా:** అది అన్ని భువనాలను పుట్టిస్తోంది. పోషిస్తోంది. అన్నింటా వ్యాపించి ఉంది. కాలమే తండ్రి, కొడుకుగా అవుతోంది. పూర్వజన్మలో తండ్రిగా ఉన్నవాడు, ఈ జన్మలో కొడుకుగా పుడుతున్నాడు. లేక ఈ జన్మలోనే తండ్రి కొడుకుగా పుడుతున్నాడు.

**కాలోభూం దివమజనయత్ కాల ఇమాః పృథివీరుత**
**కాలేహ భూతం భవ్యం చేషితం హవతిష్ఠతే**

**తా:** కాలరూపమైన పరమాత్మ ద్యులోకాన్ని, ఈ కనబడే భూమిని సృష్టించాడు. అది భూత–భవిష్యత్–వర్తమానాలకు వ్యాపించి ఉంది.

**కాలే భూతిమసృజత కాలే తపతి సూర్యః**
**కాలేహ విశ్వా భూతాని కాలే చక్షుర్విపశ్యతి**

**తా:** కాలం భవనం మాదిరిగా జగత్తును సృష్టించింది. కాలం ప్రేరేపిస్తూ ఉంటే సూర్యుడు జగత్తును ప్రకాశింపజేస్తున్నాడు. అన్ని భూతాలూ, సర్వేంద్రియ వ్యాపారాలూ ఇందులోనే.

**కాలే మనః కాలే ప్రాణః కాలే నామ సమాహితం**
**కాలేన సర్వానందం త్యాగతేన ప్రజా ఇమాః**

**తా:** కాలంలోనే జగత్తును నిర్మించాలనే మనస్సుంది. అందే ప్రాణం సూత్రాత్మగా, అంతర్యామిగా ఉంది. లేదా అన్ని ప్రాణుల మనస్సులూ, పంచప్రాణవాయువులూ ఉన్నాయి. అన్ని వస్తువుల పేర్లు, స్త్రీ పురుషాదులు... అన్నీ ఇందులో ఉన్నాయి. అన్ని వస్తువులను తయారు చేసి స్వయంగా వాటికి పేర్లు పెట్టి నడిపించేది కాలమే.

**కాలే తపః కాలే జ్యేష్ఠం కాలే బ్రహ్మ సమాహితం**
**కాలోహ సర్వస్యేశ్వరో యః పితాసీత్ ప్రజాపతేః**

**తా:** కాలంలోనే జగత్తును సృజించాలనే తపస్సు మొదలైంది. ఇక్కడ తపస్సు అనగా పర్యాలోచనం, ఇది జ్యేష్ఠము. ఇది చతుర్ముఖ బ్రహ్మకు కూడా తండ్రి.

**తేనేషితం తేన జాతం తదు తస్మిన్ ప్రతిష్ఠితం**
**కాలేహ బ్రహ్మ భూత్వా బిభర్తి పరమేష్ఠినం**

**తా:** దీని చేతనే సర్వమూ నిర్మింపదగింది. నిర్మింపబడింది కూడా. కాలమే కాల రూపమైన బ్రహ్మ. అన్నీ ఇందులో ప్రతిష్ఠింపబడి ఉన్నాయి.

**కాలః ప్రజా అసృజత కాలో అగ్రే ప్రజాపతిం**
**స్వయంభూః కశ్యపః కాలాత్ తపః కాలాదజాయత**

**తా:** ఇది బ్రహ్మను పుట్టించి ప్రజలను సృజించింది. ఇది స్వయంభువు. దీనికంటే మరొకటి లేదు. ఒకరు దీనిని పుట్టించలేరు. కశ్యపుడు(ఎనిమిదవ సూర్యుడు)కూడా దీనినుండి పుట్టినవాడే.

**కాలాదపః సమభవన్ కాలాద్ బ్రహ్మ తపో దిశః**
**కాలేనోదేతి సూర్యః కాలే నివిశతే పునః**

**తా:** నీరూ దీనినుండే. తూర్పు మొదలైన దిక్కులూ దీనినుండే. సూర్యోదయం, సూర్యాస్తమయం దీని వల్లనే.

**కాలేన వాతః పవతే కాలేన పృథివీ మహీ ద్యౌర్మహీ కాల ఆహితా**
**కాలోహ భూతం భవ్యం చ పుత్రో అజనయత్ పురా**
**కాలాదృచః సమభవన్ యజుః కాలాదజాయత**

**కాలో యజ్ఞం సమైర యద్దేవేభ్యో భాగమక్షితం**
**కాలే గంధర్వాప్సరసః కాలే లోకాః ప్రతిష్ఠితాః**

**తా:** దీని చేతనే వాయువు వీస్తున్నాడని, భూ-ద్యులోకాలు దీనివల్లనే స్థాపింపబడ్డాయని, ప్రజాపతి దీనివల్లనే భూతభవిష్యత్ వర్తమానాలను పుట్టిస్తున్నాడని, మంత్రాలకు ఇదే మూలమని, అట్లే యజ్ఞం, దేవతలు, అప్సరసలూ, గంధర్వులూ మొదలైన అన్నింటికీ ఆధారమని వేనోళ్ళ చాటింది కాలసూక్తం.

యజుర్వేదానికి సంబంధించిన అరుణ మంత్రాలలో విపులంగా కాలప్రస్తావన ఉంది.

**నదీవప్రభవాత్కాచిత్ అక్షయ్యాత్స్యందతే యథా**
**తాం నద్యోభి సమాయన్తి స్సోరుస్సతీ న నివర్తతే**
**ఏవం నానా సముత్థానాః కాలాస్సంవత్సరగ్గ్ం శ్రితాః**
**అణుశశ్చ మహాశశ్చ సర్వే సమవయన్త్రితం**

**తా:** ఒక నదిలో సెలయేళ్ళు కలిసి మహానదిగా మారునట్లు క్షణం, ముహూర్తం మొదలైన చిన్న కాలాలు, రోజు, పక్షం, మాసం మొదలైన పెద్ద కాలాలు కలిసి సంవత్సర రూపాన్ని దాల్చుతున్నాయి.

అయితే ఈ సంవత్సరం ఖండకాలం. అఖండకాలాన్ని 'అధిసత్వమని' పేర్కొన్నది వేదం. అది పరమాత్మ రూపమైనది. శాస్త్ర విచారణ వల్లగాని తెలియదని మంత్రం:

**సంవత్సరః ప్రత్యక్షేణ సాధిసత్వః ప్రదృశ్యతే**

అధిసత్వంలో అనగా పరమార్థ సంబంధమైన కాలంలో పశుపక్ష్యాదులు కాని, మనుష్యులు-చంద్ర-సూర్యాదులెవ్వరూ కాని వాస్తవంగా లేరని, ఉన్నట్లు కన్పిస్తున్నారని, ఆ చైతన్యమే కాలరూపంగా సంవత్సరం అనే పేరుతో పిలువబడుతోందని వ్యవహారకాలం అంతా అందుండే పుట్టిందని వివరించింది.

ఆ అధిసత్వాన్నే కాళిగా భావించాలి. అనగా అఖండకాలంగా భావించాలి.

'మైత్రి ఉపనిషత్తు' చక్కని వివరణ ఇచ్చింది. అన్నింటికీ అన్నము మూలకారణమని; కాలానికి, అన్నానికి సూర్యుడు మూల కారణమని చెబుతూ బ్రహ్మకు కాలంతో ఉన్న రూపం, కాలం లేని రూపం రెండున్నాయని, సూర్యునికి ముందు బ్రహ్మకు కాలం లేని రూపమని(అమూర్తం)-అది అఖండమని, సూర్యుడు పుట్టిన తరువాత మూర్తమని చెప్పింది. ఆ సూర్యుని తరువాతనే సంవత్సరమని వ్యవహారమని, ఆ సంవత్సరమే ప్రజాపతియని...

కాలమే అన్ని జీవులను వండుతోందని చెప్పింది.

**కాలో మూర్తిరమూర్తిమాన్, ద్వేవావ బ్రహ్మణో రూపే**

**కాలశ్చ అకాలశ్చ .....** ఆదిగా గల మంత్రంలో –

కపిలమహర్షి తన సాంఖ్యశాస్త్రంలో ఆకాశతత్త్వంలోనే దిక్కుగాని, కాలంకాని ఉన్నాయని, ఆకాశం ఇతర వస్తువుల సన్నిధిచే కాలాన్ని కలిగిస్తోందని అంటాడు.

ఇక మీమాంసాశాస్త్రాన్ని బట్టి కాలమొక ద్రవ్యం. అన్ని పదార్థాలకు ఆధారమైనది కాలమని, అది ఏకమని వారి సిద్ధాంతం.

**"యేన మూర్తీనాముపచయాశ్చ అపచయాశ్చ లక్ష్యన్తే తం కాలమిత్యాహుః"...** వస్తువులు తరగడానికి, పెరగడానికి ఒక కారణం ఉండాలి కదా. నిన్న చూసిన పచ్చికాయ నేడు పండవుతోంది. ఇలా కావడానికి మధ్యలో ఉన్నది కారణమైనది కాలమని వ్యాకరణవేత్త లంటారు.

ఇక వేదాంతులు నామరూపభేదమంతా కాలానికి అధీనమని, ఇదే బ్రహ్మశక్తియని... దానినే 'అవిద్య' అని అంటారు.

మాయ నుండే కాలాదితత్త్వములు పుట్టాయని మరికొందరి అభిప్రాయం.

ఎవరు, ఎన్ని చెప్పినా మొట్టమొదటిది మహాకాలం. అది నిత్యం. దానికి అవయవాలు లేవు. అది పరమేశ్వర స్వరూపం. ఇక రెండవది వ్యవహార కాలం. ఒకొక్క గోళం తన చుట్టూ తిరుగుతూ మిగిలిన గ్రహాల చుట్టూ తిరగడం వల్ల ఒకొక్క గోళంలో ఉన్న కాలానికే తేడా ఉంది. ఒక ప్రాంతానికి, మరొక ప్రాంతానికి సూర్యాస్తమయాలే తేడాగా ఉన్నాయి. మనకొకరోజైతే, ఇంచుమించు మనకు ఒక మాసం కొన్ని గోళాలలో ఒక్క రోజుగా ఉంటుందని శాస్త్రవేత్తలంటున్నారు.

కాలంపై మనస్సును లగ్నం చేస్తే గడచిన, గడవబోవు కాలాన్ని గుర్తించవచ్చని పతంజలి యోగశాస్త్రం చెబుతోంది.

వ్యవహార కాలాన్ని ఆధారంగా చేసికొని మహాకాలాన్ని పొందడమే సాధన. మహాకాలమే వ్యవహార కాలంగా పరిణమించిందని తంత్రసిద్ధాంతం.

తాంత్రికులు ఈ జగత్తును మాయగా భావించరు. దీనిని సత్యంగా భావిస్తారు. కాని ప్రతిక్షణం మృత్యువు వెంటాడుతూనే ఉంటుంది. ఈ మృత్యుభయాన్నుండి రక్షించడానికే సాధన. కనుకనే కాళీచరణాలను సేవించమంటోంది తంత్రం.

క్షణం క్షణం నశిస్తూ ఉండే జగత్తును ఒక మహాశ్మశానంగా భావించారు. ఇక్కడే కాళి కరాళనృత్యం చేస్తుంది. ఆ నృత్యం ప్రతిక్షణంలో జరిగే మార్పుని సూచిస్తుంది. ఒక శవంపై నిలబడి, ఘోరమైన కోరలతో నవ్వులను రువ్వుతూ నాలుగు చేతులతో దిగంబరంగా – నల్లని రూపంతో, కపాలమాలికతో ఒక చేతిలో ఖడ్గాన్ని, ఒక చేతిలో తెగబడిన శిరస్సుతో, వరదముద్రతో, అభయముద్రతో, నాలుకను చాచి భయంకరంగా ఉంటుంది.

**శవారూఢాం మహాభీమాం ఘోరదంష్ట్రాం హసన్ముఖీం**
**చతుర్భుజాం ఖడ్గముండ వరాభయకరాం శివాం**
**ముండమాలాధరాం దేవీం లలజ్జిహ్వాం దిగంబరాం**
**ఏవం సంచితయేత్ కాళీం శ్మశానాలయవాసినీం**

ఆమెనే దక్షిణకాళి, భద్రకాళిగా ఉపాసిస్తారు. వివేకముతో చేయు, సహజజ్ఞానంతో భేదపరచు, చమత్కార సాహసము మొదలైన అర్థాలనిచ్చేది దక్షిణ పదం. నిజమే... ఆమె సంహారశక్తే. వృథాగా సంహరిస్తుందా? వివేచనతో సంహరిస్తుంది. ఒక లక్ష్యంతో సాగుతుంది. ఒక నైపుణ్యంతో నెరవేరుస్తుంది. కసితో కూడిన సంహారమా? మరల ఒక దివ్యసృష్టి కోసమే. కనుకే ఆ దశలో ఆమె భద్రకాళి. బ్రహ్మాండమనే పెద్ద పాత్రలో చరాచర వస్తుప్రపంచాన్ని వండుతోంది. ఆమె ఒక పాచకశక్తి. జీవునికి మరణం అంతం కాదని, మరణాలు మైలురాళ్ళవంటివని, ఉన్నతస్థితి అనే భవనాన్ని చేరుకోవడానికి ఒకొక్క ద్వారబంధమే ఒకొక్క మరణమని, మృత్యురహిత స్థితియే లక్ష్యమని సూచిస్తోంది.

ఆమె నల్లనికాంతికీ అర్థం ఉంది. నల్లనిరాత్రి నుండే వెలుగు వస్తోంది కదా! ఆమె అసిత అనగా నలుపని పైమాట. అసిత యనగా బద్ధం కానిదని అసలు అర్థం. సీత–అసితేక్షణగా వాల్మీకి పెక్కుసార్లు పేర్కొన్నాడు. ఈ అర్థమే చెప్పుట సబబు.

చైతన్యం యొక్క కదలని స్థితి శివుడైతే, కదిలే శక్తి కాళి. తెల్లని శరీరం కలిగిన శివునిపై నల్లని కాళి నిలబడింది. అనగా ప్రకాశశక్తిపై విమర్శశక్తి ఉంటుంది. ఆ నల్లనిరంగులో అన్ని రంగులు లీనమౌతాయి. ఆమె దిగంబర. అనగా ఆమె శక్తి అనంతమని సూచన. కపాలమాలిక అక్షరాలను సూచిస్తుంది. ఆ అక్షరాలే నామరూప ప్రపంచం. అనగా ఈ ప్రపంచాన్ని ధరిస్తోంది. లీనం చేసుకొంటోందని సూచన.

**భూకంపాలు, ఉప్పెనలు, తుఫానులు, యుద్ధాలు, విప్లవాలు, ఈతిబాధలు... అన్నీ ఆమె లీలా విలాసాలే. ప్రతి శిశిర ఋతువు మొగ్గ తొడిగే వసంతానికి తొలిచూలుగా భావిస్తే భయమెక్కడ? ఎల్లప్పుడూ శిశిరమే ఉంటుందా? ఎల్లప్పుడూ వసంతమే**

**రాజ్యమేలుతుందా? వసంతంలో శిశిరచ్ఛాయలను చూడగలిగినా, శిశిరంలో వసంతావిర్భావాన్ని భావించగలిగినా జీవితసత్యం సాక్షాత్కరిస్తుంది.**

ఈ కాళరాత్రి స్వరూపం ఎప్పుడు తెలుస్తుంది? బలహీనునకు ఆత్మ చిక్కదనిగదా వేదమంత్రం. వట్టి శారీరక బలమే కాదు. మానసిక ధైర్యం ఉన్నవానికే – అట్టి సాధకునికే ఆమె వరప్రదాయిని.

**నాయమాత్మా బలహీనేన లభ్యః**

ధీరులే ఆమె మూలకారణాన్ని అన్వేషించగలరని మంత్రం.

**తస్య ధీరాః పరిజానంతి యోనిం**

వీర సాధకులకే, వీరాచారపరులకే ఆమె దక్కుతుంది. పశు, వీర, దివ్యసాధకులని తంత్రం అంటోంది. అందున్న వీరసాధకుడే శ్మశానంలో శవం మీద కూర్చొని, ఈమె బీజాక్షరమైన 'క్రీం'ని సాధన చేసి సిద్ధిని పొందుతాడు. ఇది మామూలు సాధకులకు ఆమడదూరంలో ఉంటుంది.

మహావిద్యాది సూత్రావళిలో వాసిష్ఠ గణపతిమునులు ఈమెను సర్వవ్యాపినిగా విద్యుత్-శక్తిగా పేర్కొన్నారు. ఈమెచే అనేక అండపిండ బ్రహ్మాండాలు సంహరింపబడుతూ ఉంటాయి. కనుక దానికి గుర్తుగా మెడలో ముండమాలను ధరించుదానిగా, మహాకాలుని నిత్య తాండవ, వైభవంగా, సృష్టి సంహారకర్త్రిగా దర్శించారు.

నేనే భువనసృష్టి నారంభించడానికి వాయువు మాదిరిగా ప్రవహిస్తాననే మంత్రాన్ని పేర్కొన్నారు –

**అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వే**

ఈమె వైభవం వల్లనే ఈశ్వరునకు పరమ కారణత్వం చెప్పబడుతోందని అన్నారు. ఆ పరమశక్తియే మన శరీరంలోనున్న కుండలినిగా భావించారు. నల్లని కాళరాత్రియే మన శరీరంలో మూలాధార చక్రంలో నిద్రిస్తున్న నల్లని పాము. అది చుట్టలు చుట్టుకొని నిద్రబోతున్నట్లుగా ఉంటుంది. దానిని సాధకుడు మేల్కొల్పుతాడు. శిరస్సులోనున్న సహస్రార చక్రం వరకూ బుసలు కొడుతూ లేస్తుంది. ప్రయత్నపూర్వకంగా లేపినా, లేపకపోయినా ఇది అన్ని యోగమార్గాలలోనూ పనిచేస్తూ ఉంటుంది. కాని కాళి యొక్క అనుగ్రహం మనకు కావాలి.

అమె పురమనెడి దేహంలో శ్రేష్ఠమైన ప్రాణాన్ని ఆవేశించి క్రియాశక్తిగా మారుతోంది.

**సా హి శ్రేష్ఠం ప్రాణమావిశ్య క్రియాశక్తిర్భవతి పురః** అని వారి సూత్రం.

ప్రాణానికి శ్రేష్ఠపరంగా, శక్తిపరంగా వ్యవహారం ఉపనిషత్తులలో ఉంది. అనగా శ్రేష్ఠ ప్రాణమని, శ్రేష్ఠపరంగా ప్రాణశక్తియని శక్తిపరంగా కేవల ప్రాణాన్ని పిలుస్తారు. ఇంద్రియాలతో కూడినపుడు శ్రేష్ఠపరంగా(శ్రేష్ఠప్రాణం) ప్రాణశక్తియని శక్తిపరంగా వ్యవహరిస్తారు.

**శ్రేష్ఠే శక్త్యాచ ప్రాణవ్యవహారః ఉపనిషత్సు దృశ్యతే**
**ఇంద్రియ సహపాఠే శ్రేష్ఠపరః**
**పరత్వేన స్తుతౌ శక్తిపరః** అని సూత్రాలు.

**పీల్చేగాలి, విడిచిపెట్టేగాలి – ఇవి ప్రాణతరంగాలే కాని, ప్రాణస్వరూపం కావు సుమా! ప్రాణుల ఈ ప్రాణశక్తి ప్రతిక్షణం క్షీణిస్తూ ఉంది. క్షీణించకుండా ఉండాలంటే ఈ ప్రాణశక్తిని సాధకుడు ఉపాసించాలి.** ఏ ప్రయత్నం లేకుండా మన దేహంలో ఈ గాలి సంచరిస్తూ ఉంది. ఒక పద్ధతిలో గాలిని విడిచిపెట్టడాన్ని రేచకమని, అట్లే గాలిని పీల్చడాన్ని పూరకమని, నియమబద్ధంగా గాలిని శరీరంలో బంధించడాన్ని కుంభకమని అంటారు. ఇదే ప్రాణాయామం. ఈ శ్వాసకర్మను గమనించడమే శుద్ధోపాసన. తెలిసి చేస్తూ ఉన్న శ్వాసక్రియ మనస్సుకి, వాక్కుకి, కంటికి శక్తిని ప్రసాదిస్తుంది. దీర్ఘ జీవితాన్ని ఇచ్చేదే ఈ ప్రాణాయామం. యోగశాస్త్ర ప్రకారం మోక్షాన్ని సాధించేది ఈ శ్వాసక్రియ. ప్రాణానికి సంబంధించిన మంత్రాలు అథర్వ వేదం ఏకాదశకాండలో 4వ సూక్తంలో ఉన్నాయి. అన్నీ వ్రాస్తే గ్రంథం పెరిగిపోతుంది.

**ప్రాణం ప్రజా అనువస్తే పితాపుత్రమివ ప్రియం**
**ప్రాణో హ సర్వస్యేశ్వరో యచ్చ ప్రాణతి యచ్చన**

**తా:** ప్రాణం, దేవ తిర్యక్ మనుష్యాదులను కప్పుతోంది. వారి వారి శరీరాలు నాడుల ద్వారా వ్యాపించి ఉన్నాయి కదా. తండ్రి తన కొడుకును వస్త్రంచే కప్పినట్లు ప్రాణం అందరినీ కప్పుతోంది. జంగమశరీరాలలో ఈ ప్రాణనక్రియ కనిపిస్తోంది. స్థావరా (వృక్షాదులు)లలో ఇది అడ్డగింపబడినట్లుంటుంది. అయితే ప్రాణం అన్నింటిలో ఈశ్వరుడై శాసిస్తోంది.

**అంతర్గర్భశ్చరతి దేవతా స్వాభూతో భూతః స ఉజాయతే పునః**
**స భూతో భవ్యం భవిష్యత్ పితా పుత్రం ప్రవివేశా శచీభిః**

**తా:** మనుష్యులలోనే కాదు... దేవతలలో కూడా ఈ ప్రాణం సంచరిస్తోంది. తండ్రి తన అవయవాలతో కొడుకులో ప్రవేశించునట్లుగా సంచరిస్తోంది. సర్వలోకానికి ప్రాణం తండ్రి వంటిది.

**అష్టాచక్రం వర్తత ఏక నేమి సహస్రాక్షం ప్రపురోనిపశ్చా**
**అర్ధేన విశ్వం భువనం జజాన యదస్యార్థం కతమః సకేతుః**

**తా:** శరీరంలో ఓజస్సుతో కలిపి 8 ధాతువులున్నాయి. ఇవే 8 చక్రాలు, దీనితో కూడినదే శరీర రథం. కాని అన్ని చక్రాలకు నేమి ఒక్కటే (చక్రం చుట్టూ ఉండే ఇనుప కమ్మి) ఇక్కడ ప్రాణమే నేమి. ఈ నేమి వల్లనే శరీర రథం కదులుతోందని చక్కని అర్థాన్నిచ్చింది అథర్వవేదం.

**ప్రాణ మామత్ పర్యావృతో నమదన్యో భవిష్యసి**
**అపాం గర్భమివ జీవసే ప్రాణ బధ్నామి త్వామయి**

**తా:** ఓ ప్రాణమా! నా నుండి వెళ్ళవద్దు. నాతో తాదాత్మ్యాన్ని చెందియున్నావు. నా జీవనం కోసం నిన్ను బంధిస్తున్నా. జలమయమైన శరీరంలో వైశ్వానరాగ్ని ఉన్నట్లుగా దేహమధ్యంలో నిన్ను ధరిస్తున్నారని అర్థం.

ఎందుకిట్లా వ్రాయవలసివచ్చింది? ఉపనిషత్తులు ఈ కాళీ విద్యనే సంవర్గవిద్య అన్నాయని, కొందరు ప్రాణవిద్య అన్నారని, కొందరు 'ముఖ్య ప్రాణోద్గీథ విద్య' అన్నారని గణపతిగారు వ్రాశారు కనుక.

**ఇయం సంవర్గ విద్యోపనిషత్సు గీయతే**
**ప్రాణవిద్యా కైశ్చిత్**
**ముఖ్య ప్రాణోద్గీథవిద్యా పరైః**

**తా:** బ్రహ్మాండంలోని ప్రాణశక్తి... అనగా కాళి యొక్క ప్రతిబింబమే మనలోని ప్రాణశక్తి, మనలోని కదలికల కన్నింటికీ ఈ ప్రాణశక్తియే కదా ఆధారం! అనంతమైన ప్రాణశక్తితో మనలోని ప్రాణశక్తిని కలపడమే సాధన. శ్వాసక్రియను గమనిస్తూ సాధన చేయాలన్నమాట.

**ప్రాణ సమీరం విదధానమిమం నిత్యాం యాత్రామాత్ర శరీరే**
**చరణే చరణే పరిశీలయతి స్థిరదృష్టిర్యస్తమవతి కాళీ**

(ఉమాసహస్రం – స 10.శ. 2 స్తబకం)

**తా:** అనగా ప్రాణవాయు సంచారాన్ని శ్వాస–నిఃశ్వాస వ్యాపారాన్ని ప్రమాదపడకుండా ధ్యానించేవానిని మూలన్వేషణం చేసే వానిని కాళిక అనుగ్రహిస్తుందని అర్థం.

ఇక సంవర్గ విద్యకూ–ఈమెకూ ఏమిటి సంబంధం? దీనిని ఒక సూత్రంలో బంధించారు.

**గత్యాగతి ప్రత్యవేక్షణ ద్వారా ప్రాణ వాయుం ధ్యాయేత్ సా సంవర్గవిద్యా**

ఈ విద్య ఛాందోగ్యోపనిషత్తులో నాలుగవ ప్రపాఠకంలో ఉంది. వాయు ప్రాణాలకు బ్రహ్మ భావనతో ఉపాసన చేయడం ఈ విద్యలో ఉంటుంది. జానశ్రుతి అనే రాజు

అన్నదానం చేస్తూ ఉండేవాడు. ఒకనాడు మేడ మీద రాజు శయనిస్తూ ఉండగా మహర్షులు హంసరూపాలు ధరించి పైన సంచరించారు. అందులో ఒకహంస, 'ఇతని అన్నదాన తేజస్సు అమితంగా ఉం'దని, 'అది దాటవ'ద్దని మరొక హంసతో అంది. ఆ రెండవ హంస–'రైక్వని మాదిరిగా ఇతణ్ణి ప్రశంసిస్తున్నావేమి'టని దెప్పి పొడిచింది. ఇతనిలో బ్రహ్మజ్ఞానం లేదని పలికింది. ఇది విన్నాడు రాజు. రైక్వుణ్ణి కలిశాడు. వాయువే సంవర్గ స్వరూపమని భావించాలన్నాడు.

**సంవర్జనాత్ సంగ్రహణాత్ సంగ్రసనాద్వా సంవర్గః** – అని ఆచార్య శంకరులు వ్రాశారు.

అనగా వదిలిపెట్టేది, లీనం చేసికొనేది, హరించేది అని అర్థం. వాయువే అన్ని భూతాలను లీనం చేసుకుంటోంది. అగ్ని ఉపశాంతమైతే అదే వాయువులో చేరుతోంది. సూర్యుడు, చంద్రుడు అస్తమించినపుడు వాయువులో లయమౌతున్నారు. అట్లే నీరు కూడా. దేవతలలోని వాయువు, ప్రాణులలోని ప్రాణమూ రెండు సంవర్గాలు. మానవుడు నిద్రబోతున్నపుడు అన్ని ఇంద్రియ వ్యాపారాలు ముఖ్యప్రాణంలోనే లీనమౌతున్నాయి. చివరకు మనస్సు కూడా ప్రాణంలోనే లీనమౌతోంది. ఇవి రెండూ రెండు సంవర్గాలు. ఈ రెంటినీ ఆత్మయందు లీనం చేయడమే లక్ష్యం. చివరకు బ్రహ్మస్వరూపమే సంవర్గ స్వరూపమై ఉందని సారాంశం.

కనుక వాయువును వట్టి గాలిగా కాక, ప్రాణాన్ని వట్టి ప్రాణంగా భావించకుండా సమస్త దిక్కులలో వ్యాపించియున్న మహాశక్తినే ఉపాసించాలని చెప్పడమే లక్ష్యం. ఈ ప్రాణవాయువులను కూడా తనలో లీనం చేసికొనే శక్తినే కాళియని తాంత్రికులంటారు. కనుక వాయువునకు మూలమైన ప్రాణానికి మూలమైన అన్వేషణ చేయాలన్నారు (శ్లోకంలో).

ఓం

# తార

రెండవ మహావిద్యయే **తార.** కొందరు బౌద్ధ, జైన మతాల ప్రభావం వల్ల హిందూ సంఘంలో తారోపాసన మొదలయిందని అన్నారు.

బౌద్ధ వాఙ్మయంలో బుద్ధులకు–బోధిసత్త్వులకు తల్లిగా పేర్కొనబడింది. కొన్ని సందర్భాలలో బోధిసత్త్వునిగా పేర్కొనబడింది. జైనమార్గంలోనూ తారా ప్రస్తావన వస్తుంది. హేమ చంద్రుడు తన 'అభిధానచింతామణి'లో తొమ్మిదవ జినుడైన సువిధినాథునకు శాసన దేవతగా, సుతారకగా, సుతారగా పేర్కొన్నాడు. తార యొక్క మరొక రూపమైన భ్రుకుటీయనే దేవత, ఎనిమిదవ జినుడైన చంద్రప్రభకు శాసనదేవతగా శ్వేతాంబరజైనులు పేర్కొన్నారు.

ఉగ్రతార నెత్తిపై అక్షోభ్యుడున్నట్లుగా తంత్రగ్రంథాలు పేర్కొన్నాయి. అసలు తారా మంత్రానికి ద్రష్ట అక్షోభ్యుడే. తంత్రాలు ఆమెను 'ప్రజ్ఞాపారమిత' అని ప్రశంసించాయి. అనగా ప్రజ్ఞ యొక్క పారం ముట్టినదని. మహాచీనాచారం ప్రకారం ఆమెను పూజించాలన్నాయి. ఈ అక్షోభ్యుడు మహాయాన–హీనయాన మార్గాలలో అనగా బౌద్ధపద్ధతిలో ప్రసిద్ధుడే. మన్మథుని తాకిడికి కలత చెందనివాడు అక్షోభ్యుడని, అతడే బుద్ధుడని అతనికొక నామం.

ప్రజ్ఞా పారమిత అనే పదం కూడా బౌద్ధవాఙ్మయానికి చెందినదే. ఇక మహాచీనం టిబెట్టే(?) బొమముడి అనే అర్థం కలిగే భ్రుకుటికి(కోపంతో ఉండేది) ఉగ్రతార శబ్దానికి దగ్గర అనుబంధం ఉంది. కనుక ఈ మాటలవల్ల తారాదేవి బౌద్ధవాఙ్మయానికి చెందినదే అని నిర్ధారణ చేసేరు. అసలు తార–ఉత్తరామ్నాయానికి చెందినదని అనగా ఉత్తర ప్రాంతపు ఆచారానికి చెందినదని కొందరు వ్రాశారు. కాని ఇలా చెప్పడం సబబు కాదు. అలా చెబితే ఈశ్వరునిపై శిరస్సు నుండి ఊర్ధ్వామ్నాయం వచ్చింది కనుక అక్కడ ఏ దేశం ఉందని చెబుతాం? ఆకాశంలో దేశాలుంటాయా? ఆపైన వసిష్ఠుడు టిబెట్టు వెళ్లి (మహాచీన) బుద్ధుని నుండి తారోపాసనను గ్రహించాడని ఒక కథ.

చాళుక్యరాజైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుని కాలంలో(6వ రాజు) అనగా 1096 ప్రాంతంలో ఒక ఱాతిశాసనంలో తారా విగ్రహముంది. అందొక శ్లోకం. ఆమె సింహం, ఏనుగులు, అగ్ని, పాములు, దొంగలు, జలార్ణవ పిశాచాదుల నుండి రక్షిస్తుందని ఆ శ్లోక తాత్పర్యం –

**హరికరి శిఖిఫణి తస్కర నిగళ జలార్ణవ పిశాచభయ శమనీ**
**శశికిరణకాంతిధారణి భగవతి తారే నమస్తుభ్యం**

ఆమె శీఘ్రంగా ఫలాలను ప్రసాదిస్తుందని, అన్నింటినుండి దాటిస్తుందని మరొక శ్లోకం–

**తారా తూర్ణ వితీర్ణ వాంఛితఫలా పాయాత్ సంగమం**

నలంద త్రవ్వకాలలో ఒక తారా విగ్రహం కనబడింది. దాని వెనుక "ఓం తారే తుత్తారే తురే స్వాహా" అనే మంత్రం ఉంది. తుర లేక త్వర అనే శబ్దాలు శీఘ్రంగా ఫలాలనిస్తాయని అర్థం కదా! నీళ్లను దాటడంలో, నౌకాయానంలో తారాశబ్దం వస్తుంది. ఈమెకు సంబంధించిన లఘుస్తవంలో **'తారం చ తోయప్లవే'** అని ఉంది. అనగా నీటిని దాటేటపుడు స్మరించాలని, లలితాదేవి యొక్క భవనాన్ని చేరుకొనేటపుడు మధ్యలో ఒక సరస్సు ఉంటుందని, దానిని నావతో దాటాలని 'లలితోపాఖ్యానం'లో ఉంది. ఇక్కడ ఉన్న అనేక శక్తులలో దాటించే శక్తి తార.

**తాసాం నౌకావాహికానాం శక్తీనాం శ్యామలత్విషాం**
**ప్రధానభూతా తారాంబా జలౌఘశమనక్షమా** (అధ్యా.31. – శ్లో.17)

సా.శ. 778లో నిర్మితమైన ఆలయం(జావా)లో ఒక సంస్కృత శాసనంలో ఈమె పూజింపబడినట్లుంది.

పై చారిత్రకాధారాల వల్ల బౌద్ధులు ఈ తారోపాసనను చేసి తమ మతాన్ని ఈ దేశంలోనే కాక జావా వరకూ వ్యాపింప చేశారంటే ఈ తారా ప్రభావమేనని అంటారు. ఈ దేవతను హిందువులు స్వీకరించారని కొందరంటారు.

బౌద్ధమతంలో తార ప్రసిద్ధిని పొందడం మాట నిజమే. అంతమాత్రంచే ఈమెను హిందువులు స్వీకరించారని నమ్మవచ్చా? హిందూమతంలో అనేక దేవ–దేవీమూర్తు లుండగా, బౌద్ధమతం వేద విరుద్ధమతమని నమ్ముతూ ఉండగా విరుద్ధమతం నుండి తారోపాసనను స్వీకరించవలసిన అవసరం ఉందా! బౌద్ధం పరమేశ్వర అస్తిత్వాన్ని గాని, వేద ప్రామాణ్యాన్ని గాని అంగీకరించ లేదు. విగ్రహారాధనను ముందది అంగీకరించనేలేదు. బుద్ధుడు అవతరించిన వెనుక అనేక శాఖలుగా చీలి, బుద్ధునికి విగ్రహాలు కల్పించి పూజించింది. అనేక మంత్రోపాసనలు చేసింది. హిందూ మార్గాలను కొన్నిటిని స్వీకరించింది. కనుక మనం ఉపాసించే తారను వారు స్వీకరించారని అంటే తప్పేముంది?

వేదాలలోనే తార శబ్దం కన్పిస్తుంది. వింధ్యకు ఇవతల ఇటీవల వరకు ఈ ఉపాసన లేదు. 'రమణగీత'లో – వాసిష్ఠ గణపతిముని భార్య మిథిలదేశంలో ఒక ఉపాసకురాలి నుండి ఈ మంత్రాన్ని ఉపదేశం పొందిందని ఉంది. ఈ ఉపాసన మాత్రం, కాశ్మీరు, టిబెట్టు, మిథిల(బీహారు) ప్రాంతాలలో ప్రబలంగా ఉంది. దక్షిణదేశంలో లేనంతమాత్రంచే ఉత్తరదేశపు దేవతయని నిర్ధారణ చేయకూడదు. అసలు దశమహావిద్యలలో చాలా వాటిని గూర్చి సామాన్య ప్రజలకు తెలియదు.

**తోడల తంత్రంలో ఈమె ప్రస్తావన ఉంది. దేవదానవులు సముద్ర మథనం చేసే సందర్భంలో ముందుగా హాలాహలం పుట్టిందని, దానిని త్రాగడానికి ఎవరూ ముందుకు రాకపోతే శివుడు అక్షోభ్యుడై(కలత చెందనివాడు) తన శక్తియైన తార అనుమతితో త్రాగాడని ఉంది.**

**తార పదానికి 'తృ' ధాతువు అనగా తరింపచేసేది. దాటుతుంది, దాటింపచేస్తుందని అర్థం. తరతి, తారయతి. తార అంటే నక్షత్రమని కూడా అర్థం. కనుగ్రుడ్డు అని కూడా. ఆ కంటి గ్రుడ్డు వల్లనే వస్తువుల్ని చూస్తున్నాం. తరి యనగా ఓడ, సముద్రం, దానిని దాటడం అనే మాటలు వేదాలలో ఉన్నాయి.** ప్రసిద్ధమైన "జాతవేదసే" మంత్రంలో సముద్రంలో నావ మాదిరిగా ఈ సంసార సముద్రాన్నుండి రక్షించనే ప్రార్థన ఉంది. అది అగ్నికి సంబంధించినదైనా దుర్గకు అన్వయించారు తాంత్రికులు.

**జాత వేదసే సునవామ సోమమరాతీ యతో నిదహాతివేదః**
**సనః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః** – ఋక్ 1,99.1

**తా:** నావికుడు ఓడ చేత సముద్రాన్ని దాటించే రీతిలో అగ్నిహొత్రుడు మా పాపాలన్నింటిని తరింపచేయుగాక! సముద్రం మాదిరిగా దుస్తరములైన పాపాలను సైతం నశింపచేయుగాక! అని అర్థం.

అలాగే అదితి దివ్యమైన నౌకతో సంబంధం కలిగి ఉంది.

మోక్షానందం కోసం ముందుకు త్రోయు సాధనంతో అనగా యంత్రంతో లోపరహితమైన బీటలు లేని రక్షకమైన భూమి మాదిరిగా విస్తరించినది, సురక్షితమైనది సుఖమైన ఆశ్రయమిచ్చే అదితి అనే నౌకను అధిరోహింతుము గాక! అనే అర్థం ఇచ్చే మంత్రం శుక్లయజుర్వేదం(21.6)లో ఉంది.

**సుత్రామాణం పృథివీం ద్యామనేహసం సుశర్మాణమదితిం సుప్రణీతం**
**దైవీం నావం స్వరిత్రామనాగ సమస్రవంతీమారుహేమా స్వస్తయే**

– ఈ తార దాటించడమే కాదు... విమల విజ్ఞానాన్ని అందించడంలో, మంచి వాక్కుని ప్రసాదించడంలో ప్రధాన పాత్ర వహించింది. కాశ్మీరు నుండి మిథిల వరకూ ఉన్న ప్రాంతంలో ఎందరో మహా విద్వాంసులు తారోపాసనచే అనేక గ్రంథాలు రచించినట్లు చరిత్ర చెబుతోంది.

దుఃఖాల నుండి రక్షించేదానిగా, దాటించేదానిగా ఒక మూల వర్ణింపబడింది. ఒక మూల వాక్కునకు సంబంధించినదిగా ఉంది. ఈ దశలో ఆమె పేరు నీలా సరస్వతి. అయితే ఆమె ప్రధాన కృత్యమేమిటని శంక.

నిరాకార–నిర్గుణ పరబ్రహ్మం సృష్టించడానికి ఆరంభించేటప్పుడు అందొక స్పందనం కలిగింది. అందుండి అనేక ప్రకంపనలు వచ్చాయి. అదే ప్రథమనాదం. ఆ నాదం నుండే వస్తు ప్రపంచం ఏర్పడింది. అనగా అర్థసృష్టికంటే ముందు శబ్దసృష్టి జరిగిందన్నమాట. "అర్థసృష్టేః పూర్వం శబ్దసృష్టిః" కనుకనే వేదాన్ని 'నిత్యావాక్' అని అంటాం. ఆ నాదం నుండి వెలువడిన మొదటి అక్షరమే 'ఓం'. అది అన్ని శబ్దాలకు మూలం. మంత్రాలకు సేతువుగా కూడా ఓంకారాన్ని కాళికాపురాణం చెప్పింది. "మంత్రాణాం ప్రణవం సేతుః".

ఆ ఓంకారమే తార లేదా తారక. వేదఋషులు దానినే అక్షరమంటారని, వేదాంతులు ప్రణవమంటారని, పౌరాణికులు గౌరి అంటారని, తాంత్రికులు తార అంటారని గణపతిమునులు తమ 'ఇంద్రాణీసప్తశతి'లో అన్నారు.

**యదక్షరం వేదవిదామృషీణాం వేదాంతినాం యః ప్రణవో మునీనాం**
**గౌరీపురాణేషు విపశ్చితాం యా సా తాంత్రికాణాం వచనేన తారా** 21(11)

ఈమెయే పశ్యంతీవాక్కు. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపాలలో వాక్కు భాసిస్తుంది. పరావాక్కు – ఇది అవ్యక్త ప్రణవం. దీనినే శుద్ధాకాశమని అంటారు. ఆత్మానుభవాన్ని ఇస్తుంది. విషయాలన్నీ దీనిలో అనుభవ వాసనారూపంలో ఉంటాయి. ఈ వాక్కునందే ఋషుల మనస్సు లీనమౌతుంది. ఇది మన శరీరంలో మూలాధారచక్రంలో ఉంటుంది. మూత్రద్వారానికి, మలద్వారానికి మధ్యలో ఈ యోగచక్రం ఉంటుంది.

ఇదే నాభియందు పశ్యంతిగా పరిణామం చెందుతుంది. దీని రెండవ రూపం మధ్యమ, మూడవది వైఖరి. పరావాక్కు జ్ఞానరూపమైతే, పశ్యంతి విద్యుత్ రూపంలో ఉంటుంది. అన్నింటిని తన ఆత్మయందు చూస్తుంది. అనగా చూచే శక్తి ఉంటుంది. శిరస్సులో బుద్ధితో కూడి వ్యవహరిస్తుంది.

ఇక మధ్యమ. ఆకాశంలో ఇది చరిస్తూ సమయం వచ్చినపుడు వ్యక్తీకరింపబడుతుంది. ఇది మన శరీరంలో హృదయంలో ఉంటుంది. అనాహతచక్రంలో జపం చేసేవారి నాదశక్తి ఈ సమష్టిరూపాన్ని పొంది ఆకాశంలో నశించకుండా ఉంటుంది. పై మూడు వాక్కులు సామాన్యులకు వినబడవు. ఒక్క యోగులకే.

ఇక వైఖరీ వాక్కు ఇంద్రియ సంబంధమైనది. ఇది మన శరీరంలో కంఠంలో(విశుద్ధి చక్రం) ఉంటుంది. దీనితో మన వ్యవహారాలన్నీ జరుపుకొంటూ ఉంటాం.

ఇక తార ఆకాశ సంబంధం కాదని (అనగా ఆకాశానికి గుణమైన శబ్దాన్నిచ్చే సగుణశక్తి కాదని), ఆకాశంలో కేవలం సంచరించే శబ్దరూపిణియని, ఈశ్వరుని చెప్పే ప్రణవమని(తస్య వాచకః ప్రణవః – పతంజలి) సూత్రీకరించారు గణపతి మునులు.

ప్రణవస్వరూపం తెలియనంతవరకూ అన్ని మంత్రాలూ వ్యర్థాలే. అంటే మంత్రధ్యానం చేసేటపుడు మంత్రనాదం, దానికి మూలమైన ప్రణవంలో లీనమైనంత వరకు జపించి ప్రణవాన్ని గుర్తెరిగినపుడే సిద్ధి అని అన్నారు.

ఋషుల తపస్సులో దర్శనమైన అన్ని మంత్రాలూ ప్రణవ సముద్రం నుండి వెడలిన తరంగాలే.

సూత్రం – **ఋషీణాం తపసి ప్రణవ సముద్రాన్నిర్గతాస్తరంగా మంత్రాః॥**

కాలువ జలప్రవానికి హేతువైనట్లే... ఋషుల వాక్కు మంత్రప్రవాహానికి హేతువైంది.

సూత్రం – **తత్రర్షీణాం వాక్ జలస్య కుల్యేన ప్రవహణ భూః**

మనం మాట్లాడే మాటలలో అటువంటి శక్తి ఉండదు. శిల్పి విగ్రహం చెక్కినా... అందులో ప్రాణశక్తిని ప్రవేశపెట్టలేనట్లే మన మాటలలో ప్రణవశక్తి ఉండదు.

కనుక తార సమష్టివాక్కు. ఆమె అవ్యక్తంగా ఉన్నపుడు ఆమెను 'నీల' అని అంటారు. ఆమెయే ఋషివాక్కులనెడి కాల్వల ద్వారా వేదత్రయరూపంలో వ్యక్తమైంది.

వేదత్రయరూపంలో ఆమెను 'శుక్ల' అని అంటారు. లోక సంబంధమైన వాక్కు సత్యాసత్యాలతో ఉంటుంది. కనుక ఆమె 'చిత్ర'గా రూపొందుతుంది.

సూత్రం - **సత్యా సమష్టివాక్**
**సైవ ఋషి వాక్కుల్యా ద్వారా వ్యక్తా త్రయీ**
**తాం శుక్లమాహుః**
**సత్యాసత్యా లౌకికీ వాక్చిత్రా**
**తారైవ నీలోచ్యతే తామసీతి**

తారను "ఓం హ్రీం స్త్రీం హూం ఫట్" అనే మంత్రంతో ఉపాసించాలి. లేదా "హ్రీం స్త్రీం హూం ఫట్"తోనైనా అనగా ప్రణవాన్ని విడిచిపెట్టి ఉపాసించవచ్చు. లేదా "హ్రీం స్త్రీం హూం" అని గాని ఉపాసించవచ్చు లేదా కేవల ప్రణవబీజమైన 'ఓం'తోనైనా.

మనస్సుతో మంత్రాన్ని అనుసంధానం చేస్తూ మంత్రాక్షరాల మధ్యలో అవ్యక్తంగానున్న శబ్దంపై దృష్టిపెడుతూ సాధన చేసిన వానికి సిద్ధి. ఈ అవ్యక్త నిష్ఠనే అక్షరవిద్యయని ఉ పనిషత్తులన్నాయి. ముందు వివరిస్తాను.

అన్నింటికీ అజ్ఞానమే మూలం కనుక ఆ అజ్ఞానాన్ని సమూలంగా పెకలించేది తార కనుక, మృత్యువు నుండి అమృతత్వానికి, చీకటి నుండి వెలుగునకు, అసత్తు నుండి సత్తునకు తీసికొనిపోయేది తార అని సిద్ధాంతం.

ఆమెయే 'ఉగ్రతార'గా, 'నీలసరస్వతి'గా, 'ఏకజట'గా ఉంటుంది. ఉగ్రతార కాళి మాదిరిగా భయంకరంగా ఉంటుంది. శవంపై నిలబడియుంటుంది. ప్రచండమైన కంపనంతో బీజభూతమైన లేదా ఆదిమమైన అచలాన్ని చీలుస్తూ ఉంటుంది. మూడు భువనాల అజ్ఞానాన్ని తాను ధరించే మానవ కపాలంలో సేకరించి భస్మం చేస్తుందని తంత్రం అంటోంది.

**జాడ్యం న్యస్య కపాలకే త్రిజగతాం హన్త్యుగ్రతారా స్వయం**

ఆకాశంలోని గాఢమైన చీకటిని చీల్చే గాఢమైన శబ్దశక్తి యొక్క వెలుగే 'నీలసరస్వతి'. 'ఏకజట' ఒక వేణి(జడ)తో ఉంటుంది. వెదజల్లబడిన శబ్ద తరంగాలను సృష్టి కోసం ఏకమగునట్లుగా చేసేది, సమకూర్చేది. ఆమె ముక్తకేశి కాదు. అనగా విరబోసుకున్న జుట్టు కలది కాదు. ఇక శుక్ల, చిత్ర భేదాలను లోగడ వివరించాం కదా!

అసలీ తారామంత్రాన్ని స్త్రీ గురువులే ప్రచారం చేసినట్లు సంప్రదాయం. పిల్ల పుట్టిన మూడురోజులు లోపుగా వసను తేనెలోగాని, నేతిలోగాని రంగరించి నీలసరస్వతి యొక్క మూడక్షరాల మంత్రంతో దానిని శిశువుకు పట్టించాలని, పిల్లకు అద్భుతమైన వాగ్ధార వస్తుందని, ఉన్నత భావాలు కలుగుతాయని అంటారు.

**జాతమాత్రస్య బాలస్య దివస త్రితయాదధః**
**జిహ్వాయాం విలిఖేన్మంత్రం మధ్వాజ్యాభ్యాం శలాకయా**

కాశ్మీరు సరస్వతీపీఠంతో, శారదాపీఠంతో విరాజిల్లడానికి ఈమెయే కారణమేమో!

ఇక టిబెట్టులో(మహాచీనా) మరొక ఆచారం ఉంది. అదే మహాచీనాచారం. స్నానం చేసి శుచిగా ఉండాలని తంత్రాలూ అంటాయి. కాని వీరు స్నానం అంటే ఏమిటి? ఎవరికి స్నానం అని ప్రశ్నిస్తారు. అలా అనడం వల్ల వీరిని తప్పుగా భావించేవారూ ఉన్నారు. కొన్ని కొన్ని తిథులు, కొన్ని కొన్ని ప్రత్యేకమైన వేళలలో పూజ ఉంటుంది మనకు. కాని వారి దృష్టిలో కాలమంతా పవిత్రమేనని, అమంగళకరమైన రోజే లేదని అంటారు. శివుడై శివుని పూజించాలి కదా! 'శివో భూత్వా శివం యజేత్.' ఇక శివుని నడవడి మనకు తెలిసిందే కదా! అలాగే మేమూ ఉంటామని అంటారు. జపంలో కాల నియమం లేదని, ఆచారాలు పాటించడం వ్యర్థమని అంటారు.

**సర్వ ఏవ శుభఃకాలో నాఽశుభో వర్తతే క్వచిత్**
**న విరోషో దివారాత్రౌ సంధ్యాయాం మహానిశి**
**దిక్కాల నియమో నాస్తి తిథ్యాది నియమో నచ**
**న జపే కాలనియమో నార్చాదిషు బలిష్వపి**
**స్వేచ్ఛానియమ ఉక్తోఽత్ర మహామంత్రస్య సాధనే**

పరమేశ్వర భావన కలిగినపుడే అది పవిత్రమైన కాలం క్రింద లెక్క. నిరంతరం ఆ నిత్యావాక్ అజపామంత్రరూపంలో (సోహం) భాసిస్తూనే ఉంది. అనగా గాలి పీల్చేటప్పుడు, వదులునప్పుడు అనుకోకుండా సోహం అని జపిస్తూనే ఉన్నాం కదా! తెలిసి సోహంను జపించాలంటారు.

అయితే ఈ సాధనలో మనం ఏమంటామంటే సత్యమే చెప్పాలని, మౌనం ఉత్తమమని తప్పనిసరియైతే కొద్ది మాటలే మాట్లాడాలని, వేదాధ్యయనం చేయాలని అపుడు 'శుక్లతార' ప్రత్యక్షమౌతుందని అంటాం.

ఇక 'చిత్రతార'ను ఉపాసించేవారు నిందాస్తుతులకు లోనుకారాదని, చక్కని వాక్యాలు విన్నా, అసందర్భ ప్రేలాపాలు విన్నా చలించకూడదని, అపస్వర సుస్వరాలలో రోదన, గానాలలో తుల్యమైన నాదాన్నే గ్రహించాలని... దేనినీ అసహ్యించుకోవడంగాని, లేదా దేనిపట్ల ప్రీతి పనికిరాదని ఈ నియమాలు పాటించాలని సూత్రాలంటున్నాయి. అఖండమైన ప్రణవాన్నే ఉపాసించాలని, ఓంకారాన్ని పైకి ఉచ్చరించడం వల్ల అది ఖండింపబడుతోందని, అది ఆమెను అనుకరిస్తోందే గాని అది తారాస్వరూపం కాదని, ఆకాశంలో సంచరించే శబ్దరూపిణియైన ప్రణవాన్నే ఉపాసించాలని తాత్పర్యం.

ఇక ఈ విద్యకు ఉపనిషత్తులలోని అక్షరవిద్యకు ఐక్యాన్ని ఘటింపచేశారు గణపతిమునులని శ్రీ ఎస్. శంకర్ నారాయణ్ గారన్నారు. ఈ విద్య బృహదారణ్యకంలో 3వ అధ్యాయంలో, అష్టమ బ్రాహ్మణంలో ఉంది.

జనక మహారాజు యజ్ఞం చేసిన సందర్భంలో బ్రహ్మవేత్తయైన యాజ్ఞవల్క్యునకు సమస్తమూ దానం చేసేటపుడు ఎందరో అతనికి అర్హత ఉందో, లేదోనని ప్రశ్నించారు. గార్గి యాజ్ఞవల్క్యుని ఇట్లా ప్రశ్నించింది.

సూత్రాత్మ దేనియందు ఓతప్రోతంగా(పడుగు–పేక రూపంలో) ఉన్నాడని ప్రశ్న. ఆకాశమని సమాధానం. ఆ ఆకాశం దేంట్లో ఉంది? అక్షరంలో అని సమాధానం.

**సహోవాచ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణ్యాపి వదంతి**

ఆ అక్షరం లావు, సన్నం, పొట్టి, పొడుగు, ఎరుపు, జిడ్డు, ఛాయ, చీకటి, వాయువు, ఆకాశం ఇది ఏదీ కాదు. సంగరహితం. రసగంధాలు లేవు దానికి. ఇంద్రియాలు లేవు. ప్రాణం లేదు. లోపల, వెలుపల అనే విభాగం లేదు. అది దేనినీ భక్షించదు. ఎవ్వరూ దీనిని భక్షించలేరు. అది నిర్విశేషం. అఖండం, ఏకరసం.

ఆ అక్షరబ్రహ్మ ఆజ్ఞ చేతనే సూర్యచంద్రులు గాని, భూలోక ద్యులోకాలు గాని నిలబడి యున్నాయి. ఆ పరమేశ్వరుడే కర్మఫలదాత. అతడే అక్షరబ్రహ్మ. అది చేతనము. స్వప్రకాశమైన వస్తువు. ఎవనిచేత చూడబడదు. తానే చూస్తుంది. తానే వింటుంది. తెలిసికొంటుంది. ఆ ఆకాశం ఈ అక్షరంలో పడుగు పేకలా ఉంది.

కనుకనే తారను మించిన మంత్రం లేదని, సమస్త సిద్ధులను ప్రసాదిస్తుందని ప్రసిద్ధమైన మాట.

**న హి తారా సమా కాచిత్ దేవతా సిద్ధిదాయినీ**

ఉద్గీథోపాసనచే తారానుగ్రహం సాధ్యమని వాసిష్ఠగణపతిమునులన్నారు 'ఉమా సహస్రం'లో.

**తారాం దేవీముద్గీథేన** - 10వ శతకం-2 స్తబకం-23 శ్లో.

ఉద్గీథం గురించి ముందు వివరిస్తా. మరి ఈ తేడా ఏమిటని శంక. తార-పశ్యంతీ వాక్కునకు సంబంధించినది. మాతంగి వైఖరీవాక్కుకు సంబంధించినది. అక్షరం ఓంకారమే కనుక వ్యక్తీకరింపబడని, చూసే శక్తి కల ఓంకారరూపిణిగా ఉపాసించాలి.

# త్రిపురసుందరి

**ఇ**ది దశమహావిద్యలలో మూడవది. సుందరియే **త్రిపురసుందరి.** మంత్రశాస్త్రంలో శివుడు ప్రకాశస్వరూపుడు. దేవి విమర్శరూపిణి. శివుడు అకారం, అమ్మవారు హకారం. అచ్చులూ హల్లులతో కూడినదే సమస్త వాఙ్మయమూ. శివుడు తెలుపు, ఆమె ఎరుపు. ఈ రెండింటి కలయిక జగత్తు పుట్టుకకు కారణమౌతోంది. విమర్శ అంటే ప్రపంచం. జగత్తునకు మూలమైన శక్తియే విమర్శ. ప్రకాశం అంటే కోరుతున్నా, చేస్తున్నాననే అహం. విమర్శ అద్దం వంటిది. ఆ ప్రకాశాన్ని అనగా తనను ప్రకృతి అనే అద్దంలో చూసి ఆ ప్రతిబింబం నేనే అని తెలిసికొని స్వరూపాన్ని పొందుతున్నాడు శివుడు.

ఆపైన శివశక్తులు బీజాంకురాల వంటివి. విత్తు నుండి మొలక – ఆ మొలక పెద్దదై విత్తు పుట్టినట్లు ఇద్దరు ఉంటారు. విత్తు ముందా? చెట్టు ముందా? అనే ప్రశ్నకు సమాధానం ఎట్లా చెప్పలేమో ఎవరు ముందని చెప్పలేకపోవటం కూడా అటువంటిదే. ఆమె ఆకారం నుండి హకారం వరకూ ఉన్న 50 అక్షరాల రూపంతో ఉంటుంది. ఆమె వల్లనే సృష్టి స్థితి లయలు జరుగుతున్నాయి. ఎప్పుడామె విముఖంగా ఉంటుందో అప్పుడే ప్రళయం. ఆమె స్వేచ్ఛగా తన యందున్న జగత్తును ప్రకటిస్తోంది. శివుడు సృష్టి స్థితి లయలను చేసినా... శక్తితో కూడినపుడే అనే విషయాన్ని మరువకూడదు.

సృష్టించాలనే భావమే కామము. పరతత్త్వం యొక్క ఆ కోరికయే కామకళ. ఆమెయే త్రిపురసుందరి.

ఎప్పుడు ప్రజాపతి మనస్సు వలన బీజరూపం వెలువడిందో అది ప్రపంచరూపమై ఇచ్ఛారూపమైన కార్యంగా ముందుగా ఆవిర్భవించిందని మంత్రం

**కామస్తదగ్రే సమవర్తతాధి, మనసో రేతః ప్రథమం యదాసీత్** – ఋక్ 5.10–129

ఆ బ్రహ్మము అనేకంగా కావాలని, పుట్టాలని కోరుకున్నాడు. తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సనగా పర్యాలోచనమని భాష్యంలో ఉంది. ఈ కనబడే జగత్తుని సృష్టించాడు. ఆ సృష్టిలో తాను ప్రవేశించాడని తైత్తరీయమంత్రం–

**సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయేతి సతపోఽ**<br>**తప్యత సతప్తస్త్వా ఇదగ్ం సర్వమసృజత**<br>**యదిదం కించ తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్**

కావున కామం సృష్టికి మూలం. తనలో లీనం చేసికోవడమూ కామమే. ఈ రెండు

విధాల కామానికి మూలం ప్రేమ. ఈ ప్రేమయే సృష్టికర్తను, సృష్టిని బంధిస్తోంది. మనుష్యుల లోనే కామము కాదు. చరాచర వస్తుప్రపంచంలోనూ ఉంది. ప్రేమ స్వార్థంతో కూడితే బంధానికి దారి తీస్తుంది. విశ్వవ్యాప్తమైతే మోక్షానికి దారి చూపిస్తుంది. ప్రేమ మనలను కొద్ది క్షణాలు మరపించేటట్లు చేస్తుంది. ప్రేమ ఒక వస్తువుకే పరిమితం కాకుండా ప్రేమతో ఈ జగత్తంగా తానేనని భావించినా, లేదా ఈ జగత్తు అమ్మవారి లీలావిలాసమని భావించినా ఆనందం అనుభవిస్తాడు సాధకుడు. ఆ ఆనందంలో సౌందర్యాన్ని చూస్తాడు. లేదా సృష్టి సౌందర్యం వల్ల ఆనందాన్ని అనుభవిస్తాడు. ప్రేమ పరిధి పెరిగిన కొద్దీ సద్భావన, దయ, అనురాగం, అనుబంధం, ఐకమత్యం వాటంతట అవే వస్తాయి. పెల్లుబికిన దివ్యోల్లాసమే ప్రేమ. ఆ ఆనందమే సౌందర్యంగా రూపెత్తుతుంది. **కామకళగా అవతరించిన ఆ త్రిపురసుందరి సౌందర్యాన్ని సాధకుడు అణువణువునా దర్శిస్తాడు. ఆమెయే రాజరాజేశ్వరి. మహనీయభావంతో ఉండేదే పరాభట్టారిక. ప్రేమమూర్తి కనుక కామేశ్వరి. సుకుమార స్వరూపంతో ఒప్పేది కనుక లలిత. లోకాలను మించిన లలిత గాన అమె లలిత యని పేర్కొనబడింది 'పద్మ పురాణం'లో.**

**లోకానతీత్య లలితే లలితా తేన సోచ్యతే**

**లోక్యంతి ఇతి లోకాః** అనే వ్యుత్పత్తిచే కిరణములు లేక ఆవరణ దేవతలు. వానిని దాటి పైన ఉన్న బిందుస్థానంలో మిక్కిలిగా ప్రకాశించేది అని అర్థం. శోభ, విలాసం, గాంభీర్యం, మాధుర్యం, స్థైర్యం, తేజస్సు, లాలిత్యం, ఔదార్యం అనే ఎనిమిది లలిత అనే పదానికి అర్థం(చూ. లలితాసహస్రనామ భాష్యం). త్రిభువనసుందరి కనుక సుందరి,

సుందరి పదానికి ముందు త్రిపుర ఏమిటి? పురమనగా నగరం. స్థలం లేదా క్రియ జరిగే చోటు, మూడేమిటి? సప్తలోకాలను దర్శించారు మహర్షులు. జనః తపః సత్యా అనే మూడు ఊర్ధ్వలోకాల క్రింద భూలోక, భువర్లోక, సువర్లోకాలుంటాయని, మధ్యలో మహర్లోకం ఉంటుందని... ఇది పై మూడింటిని. క్రింది మూడింటిని కలిపేదని భావించారు. ఉపనిషత్తులు బ్రహ్మను సత్+చిత్=ఆనందమయుడు(మూడు) అన్న-ప్రాణ-మనస్సులలో (మూడు) అనగా భౌతిక-ప్రాణిక-మానసిక జగత్తులలో (మూడు) విజ్ఞానరూపంలో వ్యాపించినట్లు పేర్కొన్నాయి.

పరబ్రహ్మలో మొదటి కోరిక కలుగగా, స్పందన కలిగి నాదమేర్పడి బిందురూపాన్ని ధరించగా... ఆ బిందువే మూడు బిందువులై త్రికోణమేర్పడింది. ఆ యోనియే సకలసృష్టికి ఆధారం. ఇలా పై మూడు రూపాలే మూడు పురాలు. మూడు అని చెప్పినచోటల్లా ఆమె

ఉంటుంది. మూడు భువనాలలో, జాగ్రత్-స్వప్న- సుషుప్తులలో; ఇచ్ఛా-జ్ఞాన-క్రియా శక్తులలో, మాన-మాతృ-మేయాలలో(లెక్క, లెక్కపెట్టువాడు, లెక్కపెట్టదగినది) జ్ఞాన, జ్ఞాతృ= తెలిసికొనువాడు, జ్ఞేయాలలో (తెలిసికొనదగినది) ఉంటుంది. వీటికి అతీతంగానూ ఉంటుంది. అనగా తురీయస్థితి. సుషుమ్న, ఇడ, పింగళ నాడులు త్రిపురాలుగా, మనస్సు, బుద్ధి, చిత్తాలను త్రిపురాలుగా భావించాలని త్రిపురార్ణవం.

**నాడీత్రయం తు త్రిపురా, సుషుమ్నా పింగళా ఇడా**
**మనోబుద్ధిస్తథా చిత్తం పురత్రయముదాహృతం**
**తత్ర తత్ర వసత్యేషా తస్మాత్తు త్రిపురా మతా**

ఇక 'కాళికా పురాణం'లో మూడు అని చెప్పబడినవన్నీ అమ్మవారి వల్లనే కలిగాయని అనగా గార్హపత్య ఆవహనీయ దక్షిణాగ్నులను మూడు అగ్నులు, మూడు లోకాలు, మూడు శక్తులు, మూడు స్వరాలు - ఇలా అనేకం మూడు... మూడుగా ఉన్నాయని, ఇవన్నీ త్రిపురా రూపాలనీ ఉంది. త్రిపురుడనగా పరమశివుడు. అతని భార్య త్రిపురసుందరి. ఇక్కడ త్రిపురాలంటే బ్రహ్మ విష్ణు శివపురములని, ఇది కలవాడు త్రిపురుడు పరమశివుడని భాస్కరరాయలవారన్నారు. పై కాళికాపురాణ పంక్తులు.

**సర్వం త్రయం త్రయం యస్మాత్ తస్మాత్తు త్రిపురా మతా**
**దేవానాం త్రితయం త్రయీహూతభుజాం శక్తిత్రయం త్రిస్వరాః**
**త్రైలోక్యం త్రిపురీ త్రిపుష్కరమథ త్రిబ్రహ్మ వర్ణాస్త్రయః**
**యత్కించిజ్జగతి త్రిధా నియమితం వస్తు త్రివర్గాత్మకం**
**తత్సర్వం త్రిపురేతి నామ భగవత్యన్వేతి తే తత్త్వతః**

**ఇక సారాంశం:** మూడు అని చెప్పబడేవన్నీ త్రిపురాదేవిపై అనగా బ్రహ్మసత్తపై ఆధారపడ్డాయని, ఆ ఆధారం లేనిదే వీటికి విలువ లేదని, నిలబడవని భావించాలి.

సాధకుడు కానివాడు వాటిని విడివిడిగా చూస్తాడు. ఆధారాన్ని గూర్చి ఆలోచించడు. అసలు త్రిపురయే మూడు రకాలుగా ఉంది. త్రిపురా త్రివిధా. ఆమెయే బాల, త్రిపురసుందరి, త్రిపురభైరవి.

త్రిపురసుందరి కూతురే బాల. అన్నీ తల్లి లక్షణాలు కలది. ఉపాసకులు భయపడకుండా ఈమెను ఆరాధించవచ్చు. త్రిపురసుందరియే త్రిపుర. బహుసుందరరూపిణి. ఇక త్రిపురభైరవి భయంకరరూపంతో ఉంటుంది. ఏమిటి ఇలా ఉండడానికి కారణం? నాణానికి బొమ్మ-బొరుసు వంటివే ఆ భిన్న రూపాలు. త్రిపురభైరవి దశమహావిద్యలలో భిన్నంగా ఉంటుంది.

త్రిపురసుందరి నుండే సమస్త దేవతలు శక్తులను పొందుతారు. ఈమెకున్న అనేక శక్తులలో మూడు ప్రధానమైనవి. ఒకటి బాలారూపంలో. రెండవది మంత్రిణి రూపంలో... ఆమెయే దశమహావిద్యలలో ప్రసిద్ధికెక్కిన మాతంగి. ఈమె వివేకానికి, వైదగ్ధ్యానికి పెట్టినది పేరు. మూడవది దండనాథ. అసురశక్తులను చీల్చి చెండాడే వారాహి. అమెయే బగళాముఖియని బగళాముఖిపట్టణంలో గణపతిమునులన్నారు.

**దండనాథా కాచన మధ్యమాయాః అధిదైవతం**

ఈమె కూడా దశమహావిద్యలలోనూ ఉంది. ఉదయించే సూర్యప్రభతో, మూడుకన్నులతో, నాలుగు చేతులు... పాశ, అంకుశ, ఇక్షుదండం, పంచ పుష్పబాణాలతో, అరుణవర్ణంతో ఉంటుంది. ఆ ధ్యానశ్లోకం చూడండి –

**బాలార్కమండలాభాసాం చతుర్బాహుం త్రిలోచనాం**
**పాశాంకుశ శరాంశ్చాపాం ధారయంతీం శివాం భజే**

ఆమె లలితాసహస్రనామాలలో –

**రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా**
**మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా** గా కీర్తింపబడింది.

ఆమె ఎర్రని ఎరుపు. ఇది రాగానికి గుర్తు. రజోగుణానికి గుర్తు. సృష్టికార్యం జరిగినపుడు రాగం ఉండాలి. రజోగుణం ఉండాలి కదా! కనుక ఉదయిస్తున్న సూర్యుని రంగులో ఉంటుంది. చేతిలోనున్న పాశము ప్రేమయే. దానితోనే ప్రపంచాన్ని బంధిస్తోంది. సంసారంలో చిక్కుకొన్నప్పుడు ఆ పాశం బంధిస్తోంది. అమ్మవారి పాదాలకు మనస్సు కట్టబడినపుడు ఆ పాశమే అతనికి ముక్తినిస్తుంది. క్రోధమే అంకుశం. దుష్టులనణచటం కోసం ఆ అంకుశం క్రోధాకారమైనది. ఇది జ్ఞానశక్తిని సూచిస్తుంది. ఆమె చేతిలోని కోదండం మనోరూపమైనది. మన్మథుని కోదండం చెఱకువిల్లే అనగా ఆమె మృదుమధురమైనదని అర్థం. ఇది క్రియాశక్తిని సూచిస్తుంది. 'పంచతన్మాత్రలు' బాణాలుగా కలదియని చెప్పడంలో పంచభూతసూక్ష్మాలు ఈమెకు బాణాలవుతున్నాయని అర్థం. అనగా పంచ మహాభూతాలను సృష్టించి వానికి మించి వెలుగుతోంది.

ధ్యానశ్లోకంలో నాలుగుచేతులతో ఉందని అన్నాం కదా! నాలుగు హస్తాలచే నాలుగు వేదాలను ధరించిందని గాని, లేదా నాలుగు హస్తాలలోనున్న ఆయుధాలతో అసురులను బాధిస్తోందని గాని, లేదా భక్తుల ననుగ్రహిస్తోందని గాని అర్థం.

సాధకుని మనస్సు ఆమె అధీనంలో ఉంచి ఆమె సంకల్పమే నెరవేరుగాక! అని భావించడమే సాధన.

దేవత యొక్క మంత్రాన్ని 'శ్రీవిద్య' అని అంటారు. దీనిని తెలిస్తే అన్నీ తెలుస్తాయని, ఈ విద్య ముక్తిప్రదాయిని అని, ఈ జన్మలోనే అది సాధ్యమని, అన్ని సిద్ధులూ దీనివల్లే కలుగుతాయని పెద్దలమాట.

**శ్రీవిద్యా జ్ఞానమాత్రేణ సర్వసిద్ధిః ప్రజాయతే**

ఇట్లు చెప్పడానికి కారణం ఏమిటి? ఈమె మంత్రమే దేవతాశరీరం. మూలమంత్రంలో పదిహేను అక్షరాలుంటాయి. మరల ఇది కాది విద్య, సాది విద్యగా ఉంటుంది. పదిహేను అక్షరాల మంత్రం పన్నెండు రకాలుగా ఉంటుంది. ఆనందభైరవ మతరీత్యా, హయగ్రీవ మతరీత్యా, దక్షిణామూర్తి మతరీత్యా పూజిస్తూ ఉంటారు. మను, చంద్ర, కుబేర, లోపాముద్ర, మన్మథ, అగస్త్య, నందికేశ, సూర్య, విష్ణు, స్కంద, శివ, దుర్వాసులు – పన్నెండు మంది దేవీపూజ ఆరాధకులవడం వల్ల భిన్న భిన్న ఆరాధనామార్గాలు ఏర్పడ్డాయి. మన్మథునకు సంబంధించి నది కాది విద్యతో, అగస్త్యునకు సంబంధించినది హాది విద్యతో ఉంటుంది. ఇవి ప్రసిద్ధాలు.

పదహారు అక్షరాలుంటే షోడశీవిద్యయని, పద్దెనిమిది అక్షరాలుంటే సౌభాగ్యవిద్యయని, పదిహేను అక్షరాలుంటే పంచదశాక్షరీవిద్యయని పిలుస్తారు.

**కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం** – పదిహేను అక్షరాలు. దానికి **'శ్రీం'** చేరిస్తే – పదహారు అక్షరాలు.

ఇది సంఖ్యాశాస్త్రాన్ని బట్టే. ఇది మూడు ఖండాలతో(కూటాలు) ఉంటుంది. మొదటి కూటం ముఖం, కంఠం నుండి తుంటిభాగం వరకు రెండవ కూటం. తుంటిభాగం నుండి చివరి వరకూ మూడవ కూటం. కనుకనే ఆ మూలకూటత్రయకళేబరగా నుతింపబడింది. మొదటి కూటం వాగ్భవకూటం. మొదటి స్పందనకు మూలం. రెండవకూటం కామరాజమని పిలువబడుతుంది. అనగా మొదటి కోరిక పుట్టిన చోటు. మూడవది శక్తికూటం. మొదటి క్రియకు చెందింది. ఈ మూడు **ఐం క్లీం సౌః** అనే బీజాక్షరాలకు సంబంధించినవి. ఇదే బాలామంత్రం. ఈ బీజాక్షరాలతో మొదటిది అయిదు వర్ణాలుగా, రెండవది ఆరు వర్ణాలుగా, మూడవది నాలుగు వర్ణాలుగా వృద్ధి పొందినపుడు పంచదశాక్షరీ మంత్రమైంది. మరొక బీజాక్షరం చేరితే షోడశి.

శాక్తేయులు విగ్రహాలకు బదులు యంత్రాలను పూజిస్తారు. అవి సరళ వక్రరేఖలతో ఉంటాయి. బిందుకోణాలతో, విగ్రహం కంటే ఇలా పూజించటం ఉత్తమమని తాంత్రికులమాట. యమ–భూతాదుల నుండి రక్షించేది యంత్రం. మంత్రమే దేవత. దేవతకు శరీరమే యంత్రమని ఈ సంప్రదాయం.

అన్ని చక్రాలలో శ్రీచక్రం గొప్పది. మహాశక్తి తన ఇచ్ఛానుసారం ప్రపంచాన్ని సృజించి, తన రూపాన్ని శ్రీచక్రంలో చూసినట్లు యోగినీ హృదయం అంటోంది. ఇందు చుక్కలు, నిలువు గీతలు, త్రికోణాలుంటాయి కదా! ఒక బిందువు, సరళరేఖలు, త్రికోణాలు వర్తులాకారాలు ఏమని చెబుతున్నాయి? ఒక బిందువు నుండే ఆ సృష్టి విలాసమంతా జరుగుతోందని సూచిస్తోంది. ఎత్తు, పొడవులతో శ్రీచక్రముంటుంది. లేదా ఎత్తులేని వెడల్పు-పొడవులతో కూడిన యంత్రాలను పూజిస్తారు. రాగివాటిపై పంచలోహాలతో చేసిన యంత్రాలమీద పూజిస్తారు. ఇది నవావరణలతో ఉంటుంది. శ్రీచక్రం శ్రీత్రిపురమే. ఇది ఆదిశక్తి యొక్క శ్రీపురమే.

రుద్రయామళం ప్రకారం ఇది లోకాలన్నింటికంటే అతీతంగా శ్రీపురముండి సృష్టి స్థితి సంహారాలను చేస్తూ ఉంటుంది. ఇందు నాలుగు శివచక్రాలు, అయిదు శక్తి చక్రాలు కలిపి మొత్తం తొమ్మిది చక్రాలతో ఉంటుంది. దీనిని శివశక్తుల శరీరంగా భావిస్తారు. ఇందున్న కోణాలు, చక్రాలు సమస్త బ్రహ్మాండానికి గుర్తులు. ప్రపంచాన్ని ఒక పటంలో చూపించి ఇది ఫలానా దేశమని ఎలా అంటున్నామో సమస్త బ్రహ్మాండాన్ని ఈ చక్రంలో చూపించవచ్చు. ఇందు అయిదు త్రికోణాలు అధోముఖంగా, నాలుగు త్రికోణాలు ఊర్ధ్వముఖంగా ఉంటాయి. ఇంకా అష్టదళపద్మం, మేఖలాత్రయం, రేఖాత్రయంతో ఉంటుంది. పంచదశీమంత్రరూపిణియైన అమ్మవారు ఉంటుంది. దీనికే వియచ్చక్రమని పేరు. ఇదంతా సాంకేతికం. వివరించడానికి సాధ్యం కాదు. వివరాలకు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారి శ్రీచక్ర విలసనం చూడండి.

ఇది బ్రహ్మాండ, పిండాండ శరీరాలకు గుర్తు. ఆదిశక్తి బిందురూపంలో ఉండగా – అది శివశక్తుల కలయికగా ఉండగా ఆ బిందువు నుండే సమస్త సృష్టి వచ్చినట్లు సారాంశం. ఆమె కామేశ్వరుని ఎడమతొడపై కూర్చున్నట్లు ధ్యానించాలి. ఆమె పాదాల నుండి కిరణాలు ప్రసరిస్తాయని మంత్రం చెబుతోంది. ఆ కిరణాల వల్లనే సూర్యచంద్రాగ్నులతో కలిసి అనేకలోకాలను ప్రకాశింపచేస్తోంది.

శ్రీచక్రంలో ఉన్న బిందువు అమృతసముద్రం. దానియందు రత్నద్వీపం – చుట్టూ కల్పవృక్షాలు, చింతామణి గృహం ఉన్నట్లుగా భావించాలి. అలాగే మన బ్రహ్మరంధ్రంలో ఉన్న సహస్రార కమలాన్ని పద్మాటవిగా భావించి బిందుస్థానంలో దేవిని భావించి బ్రహ్మాండ-పిండాండాలకు అభేదభావాన్ని గ్రహిస్తాడు సాధకుడు. ఇంకా కొన్ని వివరాలు నేను వ్రాసిన 'మన దేవతలు-శక్తి'లో ఉన్నాయి.

బ్రహ్మ, విష్ణు, ఈశానులు మంచపుకోళ్ళు కాగా సదాశివుడు పలకగా ఒక మంచంపై ఆసీనయైనట్లుగా, పంచకృత్యాలను చేస్తున్నట్లుగా (సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహాలు) కామేశ్వరునితో కూడినట్లుగా భావించాలి. పంచబ్రహ్మలు, వారి వారి శక్తులతో లేనపుడు ప్రేతలుగానే ఉంటారని ఈ రూపం తెలియపరుస్తోంది.

మహాకాళికి మహాకాళుడెట్లాగో, తారకు అక్షోభ్యుని మాదిరిగా, భైరవికి భైరవుని మాదిరిగా... ఈ కామేశ్వరికి కామేశ్వరుడు పతి. శివభక్తుల సమ్మేళనాన్నే ధ్యానించాలి. అసలీమె మంత్రంలోనే కొన్ని వర్ణాలు శివునకు, కొన్ని అమ్మవారికి చెందినవి. కనుకనే శ్రీ చక్రం "శివయోర్వపుః" అన్నారు. అనగా శివ, శివాల శరీరమే శ్రీచక్రం.

జ్ఞానశక్తియే సూర్యుడు. క్రియాశక్తియే అగ్ని. ఇచ్ఛాశక్తియే చంద్రుడు. ఈ ముగ్గురూ ఆమెకు మూడు నేత్రాలు. ఆమె కాలానికి సంబంధించినపుడు తిథుల రూపంలో ఉ ంటుంది. అవే చంద్రకళలు. పూర్ణ కాలరూపంలో ఉన్నపుడు షోడశి, కనుక చంద్రునిలో ఆమె ఉన్నట్లు పూజిస్తారు. అంతరపూజలో సహస్రారంలో ఉన్నట్లుగా భావిస్తారు. వికారాలకు, అశుచికి దూరంగా ఉంటూ సంతోషంతో సాధన చేయాలి.

**పిండే చాండే జంగమసారః శుద్ధ ప్రజ్ఞా సుందర్యుక్తా** – ఉమాసహస్రం: 10 శత, 2 స్తబకం.

**తా.** కదిలే ప్రాణులలో నిర్మలమైన ప్రజ్ఞ సుందరియని, లోపల-వెలుపల నున్న చిత్-శక్తియే సుందరియని గణపతి మునులు భావించారు.

**బోధే బోధే బోద్ధృశక్తిం సంకల్పానాం పశ్చాద్భాంతీం**

**అవి ముంచన్యః మనుతే ధీరో యత్కించిద్వా లలితా పతితం**

– (అందులోనే) ప్రతి సంవత్సరంలోనూ, ఆ సంకల్పానికి శక్తినిచ్చే శక్తిని మననం చేయాలన్నారు. అట్టివానిని రక్షిస్తుంది లలిత.

వారే మహావిద్యాది సూత్రావళిలో ఆమెకు త్రిపురాత్వాన్ని ఇలా సాధించారు. మొదటిపురం సూర్యమండలమని, రెండవపురం చంద్రమండలమని భావించారు. కొందరి అభిప్రాయం ప్రకారం గగనం మొదటిపురం, సూర్యమండలం రెండవపురం, హృదయం మూడవపురం.

ఈ విద్యకు ఉపనిషత్తులో ఈ విద్య ప్రస్తావింపబడింది(6.11-18). ప్రాచీన శాలాదులు ఐదుగురు వైశ్వానర విద్యను తెలుసుకోవడానికి ఉద్దాలకుని దగ్గరకు వెళ్ళారు. అతనికి

తెలియకపోవుటచే అశ్వపతియనే రాజర్షి దగ్గరకు వెళ్ళారు. బ్రాహ్మణులమనే అహంకారం విడిచి రాజర్షిని సేవించారు. ఆత్మస్వరూపాన్ని ఎలా ఉపాసిస్తున్నారని ఒకొక్కర్ని అడిగారు. అందొకడు ద్యులోకాన్ని ఆత్మగా, మరొకడు ఆదిత్యస్వరూపాన్ని ఆత్మగా, మరొకడు వాయువునాత్మగా, మరొకడు ఆకాశాన్ని, మరొకడు ఉదకాన్ని, మరొకడు పృథ్వీరూపాన్ని అని చెప్పారు. సర్వాత్మక వైశ్వానర రూపాన్ని అఖండ స్వరూపంతో భావన చేయకుండా ప్రత్యేకంగా భిన్నదృష్టితో ఉపాసిస్తున్నారని చెప్పి వివరించాడు. ఆ వైశ్వానరునకు ద్యులోకమే శిరోభాగం, సూర్యుడే చక్షురింద్రియం, వాయువే ప్రాణస్వరూపం, ఆకాశమే దేహ మధ్యభాగం, ఉదకాలే మూత్ర సంగ్రహ స్థానం, పృథివి పాదస్థానంగా భావన చేసి సమస్త వైశ్వానరాత్మోపాసన చేయవలసిందని... ఖండ ఖండ ఉపాసన పనికిరాదని అన్నాడు.

అట్టి భావనతో, అఖండభావనతో త్రిపురసుందరిని భావించాలి. మూడు మూడుగా ఉన్న అన్నింటిలో విడివిడిగా ఈమెను చూడడం కాదు. అఖండంగా సమష్టి భావన చేయాలన్నమాట. పై విద్య మాదిరిగా, అందుకే రెండిటికే అనుబంధం.

## హ్రీం

# భువనేశ్వరి

**నా**లుగవ విద్య **'భువనేశ్వరి.'** కాళి కాలానికి చెందితే, ఈమె ఆకాశానికి చెందింది. నిర్గుణ పరబ్రహ్మం సృష్టికి సిద్ధపడినప్పుడు ఎక్కడ, ఏ పరిస్థితి అనే సందేహం కలుగుతుంది. ఆ ప్రకాశమే ఒక హద్దును నియమించుకుని ఆకాశమైనది. ఆకాశమనగా అంతటా ప్రకాశించేదని అర్థం. అందుండే కాంతి ప్రవాహం ఆరంభమౌతుంది. ఆకాశానికి అంతరిక్ష మని కూడా అర్థం. అనగా దీని లోపల జగత్తు చూడబడుతుంది. సృష్టి ఆరంభదశలో పరమాత్మ తనను తాను చూసుకొన్నాడట. 'తదైక్షత' అని ఉపనిషత్తు. ఆ చూపే ఆకాశంగా పరిణమించింది. నామరూప జగత్తు ఏర్పడింది.

దృష్టి నుండే సృష్టియని ఒక వాదం. ఆ గ్రహణశక్తి తెలుసుకోవాలనే శక్తియే భువనేశ్వరి. కనుక ఆమె పరమేశ్వరుని ఈక్షాశక్తి. ఈ ఈక్షాశక్తి ఇచ్ఛాశక్తి కంటె వేరు కాదు. సృష్టికి పూర్వం ఈ ఈక్ష ఉన్నట్లు పైమంత్రం చెప్పింది కదా! ఈక్షకు-ఇచ్ఛకు వ్యత్యాసం లేదు. కనుక అతని ఈక్షయే విశాలమైంది. మన కన్ను ఎంతవరకు ప్రసరిస్తుందో అంతవరకూ ఉన్న దేశాన్ని చూస్తాం. అది యథార్థమైన దేశం అవుతుందా?

నిర్మలమైన జలంలో ఆకాశాన్ని చూస్తాం. అంత ఆకాశాన్ని చూడగలమా? రాత్రిపూట చంద్ర-నక్షత్రాదులతో ఉన్న ఆకాశాన్ని చూస్తాం. అదీ నిజమైన ఆకాశమా? కనుక దృష్టి ఎంతవరకూ వ్యాపిస్తుందో దేశమంతవరకే వ్యాపిస్తుంది. కాని ఈశ్వరుని దృష్టి అపారము. ఆ కారణం వల్ల విశ్వము కూడా అపారమే. అపారమైన దేశం పరమాకాశం కంటే వేరు కాదు. కాబట్టి ఈశ్వరదృష్టియైన భువనేశ్వరి పరమాకాశం అవుతుంది. ఇది గోడ మాదిరిగా ఉంటుంది. క్రియ, శబ్ద, విజ్ఞానాలు... మూడూ గోడపై నున్న చిత్రాల మాదిరిగా ఉంటాయి. కనుక భువనేశ్వరియనే తెరపై కాళీ-తారా-త్రిపురసుందరీ(రు)ల ప్రకాశం ఉంటుంది. అన్ని భువనాలూ ఆమె యందే ప్రతిష్ఠితమై ఉన్నాయి. సర్వమూ దీని యందు కానబడును కనుక అట్టి భువనాలకు తల్లి. ఆకాశం మాదిరిగా భువనాలను నిర్మించడమే కాకుండా అందు ప్రవేశించి పోషిస్తోంది కనుక ఈమె జగద్ధాత్రి.

ఈ పరమాకాశాన్నే అదితియని వ్యవహరించారు. అనగా ఖండింపబడనిది. ఈమెయే దేవతలకు తల్లి.

**అదితిర్దేవమాతా**
**అదితిర్ద్యౌరదితిరంతరిక్షమదితిర్మాతా సపితా సపుత్రః**
**విశ్వే దేవా అదితిః పంచజనా అదితిర్జాత మదితిర్జనిత్వః**– ఋ.వే. 1. అష్ట 89 సూ.

ఇందు దేవమాతగా కీర్తింపబడింది. పంచజనులూ ఆమెయే. అనగా నిషాదులతో కూడిన పంచవర్ణ ప్రజలు, లేక గంధర్వ, పితర, దేవ, అసుర, రక్షస్సులైన పంచజనులూ ఆమెయే. సృష్టిస్థితిలయలకు ఈమె కారణం.

ఈశ్వరుడు కశ్యపుడని వేదంలో పిలువబడ్డాడు. అనగా పశ్యకుడు – అనగా చూచువాడు. అనగా సాక్షిమాత్రంగా ఉండేవాడు. "కశ్యపః పశ్యకో భవతి" కనుక అదితియనే శక్తియందే పడుగుపేకల మాదిరిగా భువనాలన్నీ ఆకాశంలో ఉన్నాయని బ్రహ్మవాదిని గార్గి మాట. 'ఆకాశే ఖలు'. కనుక భువనేశ్వరియే ఆకాశమని, ఆమె భువనంగా అగుతోందని సారాంశం.

ఇంకా వివరిస్తాను. పరబ్రహ్మను 'సత్యం ఋతం బృహత్' అనే పదాలతో ఋషులు నిర్వచించారు. సత్ అనగా ఎల్లప్పుడూ ఉండేది. దీనికి సృష్టి చేయాలనే సంకల్పం కలిగినపుడు ఋతం అవుతుంది. సత్య–ఋతాల మధ్యలో బృహత్ ఉంటుంది. అనగా అంతరిక్షం. సత్యం ఋతంగా మారే రంగస్థలమే బృహత్. అదే పరమవ్యోమం. అదే అదితి. ఇది దితికి విరుద్ధం. దితి ఖండింపబడేది. అదితి ఖండింపబడనిది.

అదితి అంటే తినేది అని కూడా అర్థం. అనగా భువనాలను తనలో లీనం చేసికొంటుంది కనుక. ఈమెను ఋషి 'అనర్వా' అన్నాడు(ఋక్. 7.40.4). అనగా గుర్రం లేనిదని. అంటే వాహనం లేనిదని, ఆమే వాహనం కనుక వేరే వాహనం ఎందుకు? భువనాలను మోసేది ఆమే కదా! ఆమె 'ఋతస్య పత్నీ' అని వేదంలో ఉంది.

**మహీం ఊషు మాతరం సువ్రతానాం**
**ఋతస్య పత్నీం అవసే హువేమ** – యజు. వే. 21.5

అనగా ఋతాన్ని ఫలవంతమగునట్లుగా చేసేది. అంటే ఆకాశం రూపం లేనివానికి రూపాన్ని ఇచ్చునట్లుగా తీర్చిదిద్దుతోంది. బ్రహ్మకు ఆకాశం శరీరమని మంత్రం ఉంది.

**ఆకాశ శరీరం బ్రహ్మ** – తైత్తిరీయ. ఉప.

ఆకాశాన్ని వ్యాపించి ఉండే శుద్ధమైన కాంతి అదితి.

**జ్యోతిషీమతీః స్వర్వతీః – ఋక్.** 1.136.3

ఆమె కాంతి ఖండింపబడేది కాదు. పురాణాలలో అదితి–కశ్యపులు భార్యాభర్తలుగా ఉన్నారు.

ఈమెకు మరొక పేరు మాయ. మా అనగా లెక్కపెట్టుట. లెక్క పెట్టలేని దానిని లెక్క పెట్టేటట్లుగా చేసేది ఆకాశం. దీనినే అద్వైతులు 'అఘటన ఘటనా పటీయసీ' అన్నారు. వేదంలో లెక్కపెట్టువాడు విష్ణువు. విషు– వ్యాప్తౌ. అనగా వ్యాపించి ఉండేవాడు. అతడు మూడు పాదాలచే అనంతాకాశాన్ని లెక్కపెట్టాడు.

**త్రీణి పదా విచక్రమే** – ఋక్ 1.22.18

అతని మొదటి పదం కన్నుమాదిరిగా వ్యాపించినట్లు మంత్రం.

**దివీవ చక్షురాతతం**

ఆ విష్ణువుకే భార్య అదితి వేదంలో. ఆమే యోగమాయ. అద్వైతులు ఈ మాయను ఇంద్రజాలంతో పోల్చినా... తాంత్రికుల దృష్టిలో ఇది భ్రాంతి కాదు. అనంతశక్తియే. పరబ్రహ్మను చలించునట్లు చేసేది ఈ మాయయని వీరి తీర్పు. జ్ఞానశక్తిగా, సద్రూపిణిగా, శక్తి కంటే అభిన్నంగా వీరు భావిస్తారు. సందర్భం వచ్చింది కనుక అభిప్రాయ భేదాలను వివరిస్తా. జగత్తు మిథ్య. అసత్యమని, సృష్టిప్రళయాలే లేవని వారంటే, సృష్టిప్రళయాదులు జగత్తునకున్నాయని వీరంటారు.

జగత్తు త్రాడులో పాము మాదిరిగా భ్రాంతిచే కన్పిస్తోందని వారంటే, జగత్తు మట్టి యందు కుండ మాదిరిగా, బంగారంలో ఆభరణాల మాదిరిగా వికార రూపంలో కనబడుతోందని వీరంటారు.

అద్వైతులు జ్ఞానానికి ప్రాధాన్యత ఇస్తే, వీరు ఉపాసనకు ప్రాధాన్యం ఇస్తారు. వారు పంచభూతాలు వికృతులంటే, ఆకాశ వాయువులు ప్రకృతులని, మిగిలినవి వికారం చెందుతాయని వీరంటారు. పరమేశ్వరుడు సత్యమైతే ప్రపంచము సత్యమని వీరంటారు. కర్మ–జ్ఞానాలను వారు కలపరు. వీరు కలుపుతారు.

అద్వైతుల దృష్టిలో అన్నీ మిథ్యలే. కాలము, దిక్కు కూడా. ఈ కాలం, దిక్కు శక్తికి పర్యాయపదాలని వీరంటారు. జగత్తు అనే చిత్రాన్ని ఇచ్ఛ అనే కుంచెతో తన శరీరంపై చిత్రీకరించాడని 'యోగినీ హృదయం'లో ఒక చక్కని మాటతో ముగిస్తాను.

ఆమెకే ప్రకృతియని, ప్రధానమని మరొక పేరు. అన్నీ దీని చేత వ్యక్తం చేయబడు

తున్నాయని, దీనిచేత జగత్ప్రారంభం చేయబడుతోందని ప్రకృతి లేదా ప్రధానానికి అర్థం.

కాళి, భువనేశ్వరి కాలానికి, ఆకాశానికి అధిష్ఠానదేవతలై ఈ నామరూప జగత్తునకు కారణమౌతున్నారు. భువనేశ్వరి ఆకాశమైతే, కాళి ప్రాణశక్తి. కాళి చేసే పనులకు రంగాన్ని సిద్ధం చేస్తుంది ఈమె. కాళీ పరమకాలునితో కలిసి 'చిదంబరం'లో నృత్యం చేస్తుంది. 'దర్శనాదభ్రాసదసి' అని చిత్ర విచిత్రాలను ప్రదర్శించే వేదికగా చిదంబరాన్ని (ఆకాశాన్ని) స్తోత్రం చేసిన శ్లోకం ఒకటుంది. అదే చిదంబరక్షేత్రమని కూడా అర్థం. అంబరమంటే ఆకాశం కదా! అంబు=నీరు=జీవనశక్తి నిచ్చేది. అంబక=తండ్రి, అంబిక=తల్లి. ఈ పదాలన్నిటికీ ఒకటే ధాతువు. అనగా జీవమిచ్చేది.

బ్రహ్మాండంలో భువనేశ్వరి 'బృహత్' కాగా... అనగా అంతరిక్షం కాగా అధ్యాత్మపరంగా ఆమెయే మనలో ఉన్న హృదయాకాశం. బ్రహ్మాండంలో ఉన్న కాళి మనలోని ప్రాణశక్తి.

త్రిపురసుందరి భువనాలలో అంతర్భూతంగా ఉండి సర్వోత్కృష్టంగా ఉంటుంది. భువనేశ్వరి అందుంటూనే వాటిని భరిస్తూ ఉంటుంది. సుందరి మాదిరిగా ఉదయిస్తున్న సూర్యునిలా ఎర్రగా ఉంటూ... మూడు కనులు, నాలుగు చేతులు... రెండు చేతులలో పాశాంకుశాలు, మిగిలిన రెండు చేతులలో వరద–అభయ ముద్రలతో ఉంటుంది.

**ఉద్యదినద్యుతిమిందుకిరీటాం తుంగకుచాం నయనత్రయ యుక్తాం**
**స్మేరముఖీం వరదాకుశపాశాభీతికరాం ప్రభజే భువనేశీం.**

సుందరికున్నట్లు చెఱకుగడ, పంచ పుష్పబాణాలూ ఉండవు.

ఈ విద్యకు 'హ్రీం' బీజాక్షరం. లేదా 'ఓం' అనే ప్రణవంతో చేర్చిన బీజం కాని, అనగా 'ఓం హ్రీం ఓం'తోగాని జపించవచ్చు. ప్రసిద్ధమైన చింతామణి కంటే ఉత్కృష్టమని లేదా రెండవ చింతామణియని అంటారు. పరమాకాశం నుండే వేదమంత్రాలు వచ్చాయని, వాటికి మూలం కూడా ఓంకారమని వేదమార్గంలో ఉండగా... భువనేశ్వరి నాదశరీరమే 'హ్రీం' అని తాంత్రికులు 'హ్రీం'కారానికి పట్టం గడతారు. ఇదే తాంత్రిక ప్రణవం. దీనిని హృల్లేఖ అని కూడా పిలుస్తారు. ఇది హృదయాకాశాన్ని బృహత్ ఆకాశంతో కలిపేది. హ్రీం తోనే తన బృహత్ తత్త్వాన్ని సమస్త జీవులకు పంచిపెడుతుంది. హృదయాకాశం తన హద్దుల్ని దాటి అనంతాకాశానికి పరుగులు తీస్తుంది. హ్రీం యొక్క ప్రకంపనలు ఆకాశంలో తార స్వరంతో ఉండి భువనాలలో ప్రతిధ్వనిస్తూ తుదకు హృదయాకాశానికి చేరుకుంటాయి. దీనిని లజ్జాబీజమన్నారు. సిగ్గు, సంకోచాన్ని, స్వేచ్ఛారాహిత్యాన్ని

సూచిస్తుంది కదా! కనుక 'హ్రీం' కూడా సంపూర్ణమైన అభివ్యక్తిని సూచించదు. ఇంకా సృష్టిలో సాధించవలసినది కొంత మిగిలి ఉంటుంది. ఇంకా సంపూర్ణంగా భువనాలు రూపుదిద్దుకోవడానికి మరొక శక్తి అవసరమౌతుంది.

పంచదశి మంత్రంలో మూడు కూటాలలోను 'హ్రీం'కారం ఉంది. ఒకటి భువనాలకు సంబంధించిన జ్ఞానం, ఒకటి పరబ్రహ్మకు సంబంధించినది, ఒకటి ఈ రెండిటికి ఉన్న అనుబంధాన్ని సూచించేది. ఇది ఆకాశం యొక్క నాదం. సృష్టికర్తకై సృష్టింపబడినవాని ఆక్రందనగా భావించాలి.

కనుక సమస్త భువనాలకు ఆధారభూమి ఈ భువనేశ్వరి. ద్వంద్వాలను శాంతింపజేసేది. పరమమైనది. శాంతిమయమైనది.

సూత్రం: **భువనేశ్వరీ పరమా శాంతా...** కనుక శాంతిని కోరేవాడు దీనిని ఉపాసించాలి.

సూత్రం: **పరమాం శాంతి కామయమానో భువనేశ్వరీముపాసీత...** చూపునకు–చూడబడే దానికి మధ్యనున్న ఆకాశాన్ని సాధకుడు చూడగలగాలి. అదే శుద్ధోపాసన అనబడుతుంది.

తాను అఖండ చైతన్య స్వరూపుడేనని భావన చేయగలిగితే ఈ పరమశాంతి లభిస్తుంది. ఆకాశానికి దేనితోనూ ద్వేషం లేదు. సంపర్కం లేదు. సంసారంలో మునిగినవానికి ఆకాశం దృష్టిమార్గంగా కన్పిస్తుంది. దైవస్వరూపంగా తోచదు. దైవస్వరూపంగా భావించడమే ఉపాసన. సాధకుడు అపుడు సాక్షి అవుతాడు.

కనబడే రూపాలను విడిచిపెట్టి, నిర్మలమైన ఆకాశంలో చూపును నిలిపేవాడు నీ దయను పొందుతాడమ్మా! లేదా హృదయాకాశంలో మగ్నుడై ఆమూలరూపాన్ని వెదికేవాడు నీ అనుగ్రహానికి నోచుకుంటాడమ్మా! అని ఉమాసహస్రంలోని పసిడి పలుకు(10 శత. 2 స్తబకం).

**స్థూల వికారాన్ పరిముంచన్యా నిర్మల నభసి స్థితి యా దృష్ట్యా**
**మజ్జన్యావా దహరాకాశే లోకేశ్వరాః కరుణాం లభతే**

భువనేశ్వరీ కటాక్షం వల్ల తన శరీరం విశ్వశరీరంలో ఒక భాగమని, అనంత ప్రాణశక్తిలో ఒక లవలేశమే తన ప్రాణమని సాధకుడు భావిస్తాడు.

ఈ విద్యకు–'ఛాందోగ్యోపనిషత్తు'లోని 'పరోవరీయసీ విద్య'కు అభేదాన్ని చూపారు గణపతిమునులు.

శిలక, చైకితాయన అనే ఇద్దరు ఋషులు ప్రథాహణుడనే రాజర్షితో ఉద్గీథోపా(స)న గురించి చర్చించారు(ఓంకార ప్రతీకోపాసన గురించి).

సామగానానికి ప్రధానమైన ఉద్గీథానికి ఏది ఆశ్రయమని ప్రశ్న. స్వరం సామానికి ఆశ్రయమని జవాబు. స్వరానికి ఏది ఆశ్రయం? ప్రాణబలంచే స్వరం ఉచ్చరింపబడుతోంది కనుక స్వరానికి ప్రాణమే ఆశ్రయమని జవాబు.

ప్రాణానికి ఏది ఆధారం? అన్నం లేకపోతే జీవి శుష్కిస్తాడు కనుక అన్నమే ప్రాణానికి ఆధారమని జవాబు. ఆ అన్నం దేనివల్ల? నీటి వల్ల అన్నం. ఆ నీటికి ఏది ఆశ్రయమని మరల ప్రశ్న. ఊర్ధ్వలోకమని జవాబు. ఆ ఊర్ధ్వలోకమైన స్వర్గానికి ఏది ఆశ్రయం? స్వర్గలోకంలో ఉండే దేవతలకు ఈ భూలోకం నుండే హవిస్సులు అందుతున్నాయి కనుక భూలోకమే ఆశ్రయమని జవాబు. భూలోకానికి ఆశ్రయం ఏది? సర్వభూత ఉత్పత్తి స్థితిలయాలకు కారణం ఆకాశం కనుక సర్వాశ్రయమైన పరమాత్మ స్వరూపమైన ఆకాశమే ఆశ్రయమని, ఈ ఉద్గీథానికి ఆశ్రయ స్థానం పరమాకాశమేనని జవాబు. ఇట్టి ఆకాశ స్వరూపిణి భువనేశ్వరియే.

# త్రిపురభైరవి

**అ**యిదవ మహావిద్యయే **త్రిపురభైరవి**. త్రిపుర పదం మనకు తెలుసు. అసలు భైరవ పదానికి అర్థం ఏమిటి? 'భ' అంటే భరణమని, 'ర' అంటే ప్రపంచ విలీనమని, 'వ' అంటే వమనం – అనగా సృష్టించుట అని అర్థం(చూ. విజ్ఞాన భైరవ తంత్రం). అతని శక్తి భైరవి.

'భా' అనగా కాంతి. 'ఐ' అనగా కాశ్మీరశైవంలో క్రియాశక్తిని సూచిస్తుంది. 'వ' – లోన కలిగియుండేదని చెప్పబడింది (అందు 130 శ్లో). అనగా తన క్రియాశక్తితో అఖిల ప్రపంచాన్ని ఆవరించి, అన్నింటిని ఇస్తూ ధ్వనింపచేసేవాడు భైరవుడు.

అభినవ గుప్తపాదులవారు 'పరాత్రింశిక'లో "భైరవో భరణాత్మకో మహా మంత్ర రవాత్మకశ్చ" అని పేర్కొన్నారు. ప్రపంచానికి ఆధారంగా ఉంటూ రక్షిస్తూ 'అహం' 'అహం' అంటూ ధ్వని చేసేవాడని వ్రాశారు. వారు తంత్రాలోకంలో అనేక అర్థాలిచ్చారు. ధారణ, పోషణలు చేసేవాడని, అహమహమని అనేవాడని, సంసారభయంచే బాధపడేవారిని రక్షించేవాడని అన్నారు. అసలు కథలోకి వద్దాం.

ముందుగా పరమేశ్వరుడు సృష్టించాలని కోరుకున్నాడని వ్రాశాం కదా! "సోఽ కామయత". దానినే ఇచ్ఛాశక్తి అని అంటారు. ఆ శక్తికి చెందినదే త్రిపురసుందరి. 'తదైక్షత' అనగా చూశాడు. ఇదే ఆకాశం. జ్ఞానశక్తికి సంబంధించింది. ఈమెయే భువనేశ్వరియని చదువుకున్నాం. తరువాత అతడు తపస్సు చేశాడని 'స తపోతప్యత' అనే మంత్రం. అనగా క్రియాశక్తి. ఆశక్తినే త్రిపుర భైరవియని అంటారు.

తపస్సంటే ఏమిటి? తప–సంతాపే=దీని యందు తపింతురు. తపంతి–వ్రతం కుర్వంతి అస్మిన్నితి=ఇందు వ్రతాదులు చేస్తారని అర్థం. ఒక తీవ్రమైన పనికి ఆరంభించేటప్పుడు ఒక తీవ్ర ఏకాగ్రతలో మన శరీరం, మనస్సు వేడెక్కడం మన అనుభవంలో ఉన్నదే. ఆ వేడికి ప్రతినిధి అగ్ని. అది వట్టి అగ్ని కాదు. చిదగ్ని. విశ్వవ్యాప్తమైన ఆ అగ్నినే జాతవేదుడని వేదం అంటోంది. తైత్తిరీయంలో :–

**జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః**
**సనఃపర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సిన్ధుం దురితాత్యగ్నిః**

**తా:** జ్ఞానం ఎవని నుండి కలుగుతుందో అతడు జాతవేదుడని చెప్పబడతాడు. అట్టి అగ్ని కొరకు యజ్ఞక్రియలు ఆరంభిస్తున్నామని, మా శత్రువులు నాతడు దూరం

చేయుగాకయని నావికుడు ఓడచేత సముద్రాన్ని దాటించే రీతిలో సముద్రంవలె దాటశక్యం కాని పాపాలనన్నింటినీ అగ్ని నశింపజేసి తరింపచేయాలని ప్రార్థన.

ఈ అగ్నియే తంత్రాలలో దుర్గ. ఆమె ఎలా ఉంటుందో వివరించింది మంత్రం :-

**తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషుజుష్టాం**
**దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః**

**తా:** అగ్నితో సమానమైన దేహం రంగు కలిగినది, తన దేహకాంతిచే భక్తుల శత్రువులను కాల్చునది, పరమాత్మ సంబంధమైనది, ఉపాసకులచే సేవింపబడేది యైన దుర్గాదేవిని స్మరిస్తున్నాం.

ఈమెకు వైరోచని అని కూడా వ్యవహారం. 'విశేషణ రోచతే – స్వయమేవ ప్రకాశత ఇతి విరోచనః పరమాత్మా.' అనగా విశేషంగా, స్వయంగా ప్రకాశించేవాడు పరమాత్మ. కనుక వైరోచని యనగా పరమాత్మ సంబంధమైనది.

విశ్వవ్యాప్తమైన ఆ అగ్ని, లేదా అగ్నిరూపమైన దుర్గ మన శరీరంలో మూలాధార చక్రంలో ఉంటుంది. అది మన సూక్ష్మ శరీరంలో చుట్టలు చుట్టుకొని నిద్రపోతున్న పాములా ఉంటుంది. తపస్సు యొక్క స్తబ్ధస్థితి, నిద్రపోతున్న స్థితి త్రిపుర భైరవి. సుందరి మాదిరిగా త్రికోణంలో అంతస్థమై లేదా అంతర్వ్యాప్తమై ఉంటుంది. మూలాధార త్రికోణంలో లోపల రగిలే పొగతో కూడిన మంటలా ఉంటుంది. 'త్రికోణాంతరదీపికా' అని లలితానామం. ఎఱుక కలిగి కదలక మెదలక పడి ఉంటుంది.

తపస్సంటేనే చైతన్యం యొక్క ఏకాగ్రత కదా! ఏకాగ్రత ఎప్పుడైతే ఉందో ఒక ప్రదేశానికి పరిమితమై ఉంటుంది. లేనిచో దానికి వ్యాప్తి ఉంటుంది కదా! కనుక ఈ హద్దు ఒక మహా కార్యక్రమానికి కావాలి. సృష్టికార్యానికి ఈ బీజరూపమైన శక్తి కావాలి. ఇతరమైన వాటిని పట్టించుకోని స్థితి కావాలి. హద్దులు లేని దానికి హద్దును, కొలవడానికి వీలులేని దానిని కొలిచే స్థితి, రూపరహితమైన దానికి రూపం ఇచ్చే స్థితి... ఈ ఏకాగ్రత వల్లనే సాధ్యం.

ఈ ఏకాగ్రతలోనున్న స్థితి పైకి జడంగా ఉన్నట్లు కన్పిస్తుంది. నిద్రపోతున్నట్లుగానే ఉంటుంది. ఏ పని సాధించాలన్నా రెండు శక్తులు కావాలి. ఒకటి స్తబ్ధత, రెండవది క్రియాశీలత... అనగా చలనంతో ఉన్న స్థితి. ఈ స్తబ్ధత ఒక పదార్థాన్ని సంగ్రహించి పెట్టే స్థలం. ఒక జలాశయం వంటిది. రాబోయే ఉపయోగానికి నిలువ ఉన్న స్థితి. దీనిని

బిగించి ఉంచుతారు. అవసరమైనపుడు తాళాలను తెరుస్తారు. అప్పుడా ప్రవాహం ఉరవళ్లు పరవళ్లు త్రొక్కుతూ ప్రవహిస్తుంది. ఆ ప్రవాహం మన అందరికీ ఉపయోగిస్తుంది.

కనుక నిలువయున్న స్థితి త్రిపురభైరవి. కదిలే దశ త్రిపురసుందరి. త్రిపురభైరవీ స్థితిని తపస్సువల్ల, ఏకాగ్రత వల్ల విడుదల చేస్తే ఆ అగ్నిశక్తి దేహమంతటా ప్రసరిస్తుంది. ఇక ఆనందామృతాన్ని వర్షిస్తుంది. ఈ వర్షించే దశ త్రిపురసుందరిది.

మనలో మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార చక్రాలున్నాయి. ఇవి వరుసగా గుద, లింగ, నాభి, హృదయ, కంఠ, ఫాలభాగ, బ్రహ్మరంధ్రాలలో ఉంటాయి. మూలాధారం భూతత్త్వానికి, స్వాధిష్ఠానం అగ్నితత్త్వానికి, మిగిలినవి అప్ (నీరు), వాయు, ఆకాశ మనస్తత్త్వాలకు చెందినవి. మూలాధార, స్వాధిష్ఠానాలు – అగ్నిమండలంగా, రుద్రగ్రంథిగా; విశుద్ధ, ఆజ్ఞాచక్రాలు – చంద్ర మండలం, బ్రహ్మగ్రంథిగా లెక్కింపబడతాయి.

ఆజ్ఞాచక్రంలో శివుడు దేవితో దేదీప్యమానంగా, విశుద్ధచక్రంలో స్ఫటికకాంతితో, అనాహతంలో హంసలజంటగా శివశక్తులుంటాయి. మణిపూరంలో శివుడు మేఘంగా, స్థిరమైన కాంతిరేఖగా శక్తి ఉంటుంది. స్వాధిష్ఠానంలో శివుడు లోకాలను దహిస్తూ ఉంటే అమ్మవారు కరుణతో చూస్తుంది. మూలాధారచక్రంలో లాస్యతాండవాలు చేసే శక్తి–శివులు ఉంటారు. మూలాధారంలో కుండలిని అనే శక్తి సర్పాకారంలో ఉండి బ్రహ్మరంధ్రం వరకూ వ్యాపించియుంటుంది. సాధన చేసేవారు ప్రాణాయామం వల్ల స్వాధిష్ఠానంలో నున్న అగ్నిని రగుల్కొల్పుతారు. దాని తాకిడిచే ఆ శక్తి మేల్కొని అన్ని గ్రంథుల్ని చీల్చుకొని సుషుమ్నానాడిగుండా సహస్రదళపద్మంలోని శివునితో ఆనందాన్ని పొంది తిరిగివస్తుంది.

బ్రహ్మరంధ్రంలో ఉన్న సహస్రదళ కమలాన్ని పద్మాటవిగా భావించి, అక్కడున్న బిందుస్థానంలో దేవిని భావించి బ్రహ్మాండ పిండాండాలకు అభేదాన్ని చూస్తాడు సాధకుడు. సహస్రారంలో ఉన్న చంద్రమండలాన్ని కుండలిని చేరుకుంటుంది కదా! ఆ చంద్రమండలం చల్లదనంతో ఘనీభవించి అమృతమయంగా ఉండగా, దానియందు అగ్ని రూపంలోనున్న కుండలిని ప్రవేశించగా అమృతం ద్రవిస్తుంది. దానివల్ల డెబ్బైరెండు వేల నాడులూ తడుపబడతాయి.

మూలాధారం నుండి సహస్రారం వరకూ వీపు తట్టున బ్రహ్మదండియనే ఒక పెద్ద ఎముక ఉంది. అదే మేరుదండం. మూలాధారం నుండి సహస్రారం వరకూ సుషుమ్నానాడి

వ్యాపించియుంది. కుండలిని పాము మాదిరిగా ఉండి మూలాధారంలో తలను, ఊర్ధ్వ కుండలియందు తోకనూ కలిగి యుంటుంది. సుషుమ్నానాడి మధ్యలో కుండలిని తామర తూడులోని సన్ననిదారంలా ఉంటుంది. దీనిని లేపుతాడు సాధకుడు. ఆ సుషుమ్నకు ఎడమ–కుడి ప్రక్కలలో ఇడా–పింగళ నాడులు ఉంటాయి. ఎడమ–కుడి ముక్కులలో సంచరించే వాయువును ఒక క్రమ పద్ధతిలో సంచారం చేయించి, ఆ గాలిని కుంభకం ద్వారా బిగపెట్టియుంచి లోనున్న కుండలినిని లేపుతాడు సాధకుడు. ఆ నాడులు ముఖ్యమైన నాడులు. అందు ప్రాణసంచారం ఉంటుంది. వాయువు గుదస్థానంలో, వ్యానము శరీరమంతటా ఉంటుంది. ఉదానం కంఠంలో, సమానం నాభిలో ఇంకా అయిదు రకాల వాయువులుండి శరీరాన్ని నిలుపుతున్నాయి. ఈ వాయువులను బంధించి, తద్వారా మనస్సును బంధించి ఏకాగ్రతతో, శరీర–మనస్సులను శుద్ధిచేసికొని బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు సాధకుడు.

ఒకే ఒక శక్తి సుందర భయంకర రూపాలలో ఉంటుంది. ఇది బొమ్మ–బొరుసు కలిగిన నాణెం వంటిది. ఇద్దరూ త్రిపురలే. ఈ రెండూ శ్రీవిద్యకు చెందినవే. ఇద్దరి మంత్రాలూ మూడు ఖండాలుగా విభజింపబడ్డాయి... వాగ్భవ, కామరాజ, శక్తి కూటాలుగా. కాని ఒకటి మూలాధారంలో, ఒకటి సహస్రారంలో ఉంటుంది. మూలాధారంలో తపస్సనే జలాశయం నుండి శక్తి ప్రవాహాలు సహస్రారంలోని సుధాసింధులో కలుస్తాయి. మరల సుధాసింధువు నుండి అనగా సహస్రారం నుండి అమృతధారలు మూలాధారంలోకి చేరుతాయి. భైరవి ఆరోహణశక్తి, సుందరిది అవరోహణశక్తి. ఇలా క్రిందనుండి పైకి, పై నుండి క్రిందకు మాటిమాటికి శక్తి ప్రవాహం ఉంటుంది.

సుందరి వర్షిస్తుంది. భైరవి తపిస్తుంది. "ఆర్ద్రం జ్వలతి". తపించే శక్తి ద్వారా సాధకుని శారీరక, మానసిక మాలిన్యాలు దగ్ధం చేయబడతాయి. సాధకుని తీర్చిదిద్దుతుంది భైరవి. పైనుండి జాలువారు సోమరసాన్ని త్రాగడానికి అర్హత కలిగిస్తుంది భైరవి. పై నుండి జాలువారు సోమరసం సోమునకు అనగా చంద్రునకు చెందినది. సహస్రారంలో చంద్ర మండలం ఉందని చెప్పాం కదా! అదే అన్నం. దీనివల్ల మనిషి బ్రతుకుతున్నాడు. కనుకనే మంత్రం "సోమో వా అన్నం" అన్నది. అగ్ని అన్నాన్ని తింటున్నాడు. "అగ్నిరన్నాదః"... సాధకుడు తన తపస్సు ద్వారా సోమ–అగ్నులకు సంబంధాన్ని కలుగచేస్తున్నాడు. యజ్ఞంలో కూడా సోమరసాన్ని కాల్చని పాత్రలో పోయరు. భైరవి తపస్సుతో వేడెక్కిన శరీరమనే పాత్రలోనే సుందరి వర్షిస్తుంది. భగభగమండే శుద్ధమైన అగ్నిజ్వాలలే సోమామృతాన్ని త్రాగగలవు.

కనుక సాధకుడు అగ్నితప్తుడు కావాలి. కేవలం తన శక్తితోనే సాధించలేడు. అమ్మవారి దయ కావాలి. ఇక్కడ హృదయ స్థానంలో ఉన్న భువనేశ్వరి మూలాధారంలో ఉన్న ప్రకృతిని, సహస్రారంలోని సుందరీ శక్తితో కలుపుతుంది. నిజంగా ఈ ముగ్గురూ త్రిమూర్తులే. హృదయాకాశంలో అనాహతచక్రంలో, సూర్యుడు స్థానంగా కలిగిన జ్ఞానపీఠంలో భువనేశ్వరి ఉండి అగ్ని-చంద్రులకు కాంతిని కలిగిస్తోంది. కనుక హృదయస్థానం... శీర్షస్థానాన్ని, క్రిందనున్న మూలాధారాన్ని నియమిస్తోంది.

హృదయంలోని జ్ఞానశక్తియే శిరస్సులోని ఇచ్ఛాశక్తిని, మూలాధారంలోని క్రియాశక్తిని నడుపుతోంది. కనుక త్రిపురసుందరి, త్రిపుర భైరవులను సంధానం చేసేది భువనేశ్వరి. భువనేశ్వరి ఈ పనినెట్లా చేస్తుంది? కాళిని అసరాగా చేసుకునే తెరవెనుక భువనేశ్వరి, తెరముందు కాళి వీటిని కలుపుతున్నారు. అనగా ఆకాశం, కాలశక్తులు కలిసినపుడు సాధకునకు అనందామృతం లభిస్తోంది.

ఇక ఈమెకు సంబంధించిన మంత్రం: హ్సైం హ్స్క్లీం హ్స్రౌః

– వేయి సూర్యుల కాంతితో, ఎర్రని వస్త్రంతో, కపాలమాలికతో, రక్తంతో తడిసిన పయోధారలతో పద్మ సమానమైన ముఖం నుండి చిరునవ్వుతో, మూడు కనులతో, రత్నకిరీటం పైనున్న చంద్రరేఖతో, నాలుగు చేతులు – ఒక చేతిలో అక్షమాల, మరొకటి జ్ఞానముద్ర, మరి రెండు వరద–అభయముద్రలతో భయంకర సౌందర్యంతో ఉంటుంది.

**ఉద్యద్భాను సహస్రకాంతిమరుణక్షౌమాం శిరోమాలికాం**
**రక్తాలిప్త పయోధరాం జపవటీం విద్యామభీతిం వరం**
**హస్తా బ్జైద్దధతీం త్రినేత్ర విలసత్ వక్త్రారవిందశ్రియం**
**దేవీం బద్ధహిమాంశురత్నమకుటాం వందే సమందస్మితాం"**

ఈమె ధరించిన కపాలమాలికను గురించి చెప్తూ 'క' అంటే పరాశక్తియని, 'పాల' అంటే రక్షించువాడు శివుడని, శివ–శక్తుల సమ్మేళనమే కపాలమని తంత్రకోశంలో చెప్పబడింది.

**'క' శబ్దేన పరాశక్తిః పాలకః శివసంజ్ఞయా**
**శివశక్తి సమాయోగః కపాలః పరిపఠ్యతే**

ఈ రూపం, ఈ బీజాక్షరాలే భయంకరంగా ఉన్నాయి. ఎవరికీమె భయంకరంగా ఉంటుంది? సంసారంలో చిక్కుకున్నవారికి, ద్వైతభావనతో ఉన్నవారికి, నానాత్వం భావంతో

ఉన్నవారికి భయం. పై వాడు వేరు, నేను వేరంటనే భయం. ఆత్మయందు భేదభావాన్ని చూడనివానికి అభయం. బ్రహ్మజ్ఞానం కల దేవాదులకు కూడా నిరంతరమైన ఆత్మజ్ఞాన నిష్ఠ గట్టిగా లేకపోవడం వల్లనే వారూ భయపడుతున్నారని తైత్తిరీయం చెప్తోంది. "భీషాస్మాద్వాతః పవతే..." సాధకుడు ఆత్మయందు ప్రతిష్ఠను పొందితే అతడే బ్రహ్మస్వరూపుడై అభయాన్ని పొందుతున్నాడు. ఆ భావన నిరంతరం లేనివానికి ఆమె భయంకరస్వరూపురాలే.

ఇక త్రిపురభైరవి 'పరావాక్కు'నకు సంబంధించింది. దీనిని గురించి లోగడ వివరించా. పరాయనగా మహోత్తమం, అందనిది, వ్యక్తం చేయబడనిది అనే అర్థాలున్నాయి. ఆమె వ్యక్తమైన దశలు పశ్యంతి, మధ్యమ, వైఖరులని చదువుకున్నాం. ఈ మూడు వ్యక్తమగునట్లుగా చేసేది, ఈ మూడిటికి అతీతంగా ఉండేది, బలాన్నిచ్చేది పరావాక్కు. భైరవి పరావాక్కు, తార పశ్యంతీ వాక్కు. కనుక వాక్కు యొక్క మూలస్వరూపం 'పరా'.

ఈమె మూలాధారంలో ఉంది కదా! ఇది కామశక్తికి కేంద్రం కూడా. సంతానానికి మూలకారణం కూడా. బ్రహ్మచర్యం పాటించడానికి, లేక సంతానం కనడానికి ఈమెయే కారణం. బ్రహ్మయందు చరించడాన్ని బ్రహ్మచర్యం అంటారు. కామశక్తిని స్త్రీగర్భంలో ప్రవేశపెట్టడం సహజం. ఆ రేతస్సును ఓజస్సుగా మార్చడమే సాధన. వృథాగా వాగ్వ్యయం చేయకుండా ఆ మూలం పరావాక్కును అన్వేషించడం సాధన. అలాగే కోట్ల కొద్ది ఆలోచనలు చేస్తూ ఉంటాం. ఆలోచనలను తగ్గించగలిగి, లేదా ఆలోచనలకు మూలమైన ఆలోచన(బాగుగా చూచుట) చేయగలిగితే పరావాక్ స్థితిని పొందుతాడు. ఇలా మనోవాక్కాయాలను నియంత్రించేది, సాధకుని భయాన్ని పోగొట్టేది, శక్తిపదార్థాల అంతరాన్ని తుడిచివేసేది భైరవి.

ఈ విద్యకు ఛాందోగ్య ఉపనిషత్తు(3.14)లోని శాండిల్యవిద్యకు అభేదాన్ని ఘటించారు గణపతిమునులు.

శాండిల్యుడు అగ్ని రహస్యాన్ని తెలిసిన మహర్షి. అగ్ని ఋగ్వేదంలో కవిక్రతువుగా పేర్కొనబడింది. ఈ ఉపనిషత్తులో "సక్రతుం కుర్వీత" అని ఉంది. సః = సాధకుడుబీ క్రతుం = బ్రహ్మ విషయకధ్యానమునే, కుర్వీత = చేయవలసినదని అర్థం. ఈ ప్రపంచం అంతా సృష్టి కాలంలో బ్రహ్మయందే పుట్టి, లయకాలంలో బ్రహ్మలోనే లీనమై, స్థితికాలంలో బ్రహ్మసత్త చేతనే వ్యాపింపబడి ఉన్నందున కాలత్రయంలోనూ బ్రహ్మస్వరూపంగా ఉందని భావించి సాధకుడు సద్గుణాలతో కూడి పరబ్రహ్మోపాసన చేయాలని చెప్తోంది. పురుషుడు

సంకల్పం వల్లనే ఏర్పడి, సంకల్ప వికారమే అయి ఉండడం వల్ల ఈ జన్మలో ఏ సంకల్పంతో ఉంటాడో, లోకాన్ని విడిచి జన్మాంతరంలోనూ అదే సంకల్పంతో పుడతాడని కనుక సాధకుడు శమదమాది గుణాలతో బ్రహ్మస్వరూప ధ్యానం చేయాలని సందేశం.

**సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత** అని మంత్రం మొదలుగా ఈ విద్య ఉంటుంది.

బ్రహ్మము ఆకాశం మాదిరిగా సర్వవ్యాపక స్వరూపం కలదియని, అంతర్యామిగా ఉండి సర్వభూతాలను ప్రవర్తింపచేస్తోందని... ఇది అణువు కంటె అణువుగా, మహత్తు కంటె మహత్తుగా ఉంటుందని హృదయంలోని బ్రహ్మమునకు–పరబ్రహ్మలకు ఏకత్వం చెప్పింది ఈ విద్య.

ఇందున్న సంకల్పానికి, ఈ తాంత్రికవిద్యలోని తపస్సునకు సంబంధం ఉంది.

దేవతలను స్వాహాకారంతో, పితృదేవతలను స్వధాకారంతో తృప్తి పరుస్తారు. స్వాహా, స్వధలకు భైరవికి అభేదమని గణపతిమునుల సూత్రాలు. మొదట పేర్కొన్న జాతవేదసే – మంత్రంలో కష్టాలు దాటగోరేవాడు ఈ భైరవిని ఉపాసించాలని అన్నారు.

# ఛిన్నమస్త

దశమహావిద్యలలో ఆరవది ఛిన్నమస్త.

> ప్రత్యాలీఢపదాం సదైవ ఛిన్నం శిరః కర్త్రికాం
> దిగ్వస్త్రాం స్వకబంధ శోణిత సుధాధారాం పిబంతీం ముదా
> నాగాబద్ధ శిరోమణిం త్రిణయనాం హృద్యుత్పలాలంకృతాం
> రత్యాసక్త మనో భవోపరి దృఢాం ధ్యాయేత్ జపాసన్నిభాం

ఖండిత శిరస్సు... ఆ శిరస్సు నొక చేతితో ధరిస్తూ మొండెం నుండి వెలువడిన రక్తధారలు. అందొక ధార ఖండిత మస్తకంలో పడుతూ, మరి రెండు ధారలు ప్రక్కనున్న వర్ణిని, డాకిని అనే యోగినుల నోళ్లల్లో పడుతూ, దిగంబరంగా ఉంటూ ఒక చేతితో కత్తెరను ధరిస్తూ, మాంసంతో అలంకరింపబడిన రూపాన్ని ధ్యానం చేస్తున్నాను.

ఈ రూపాన్ని తలుచుకొంటేనే ఒళ్లు జలదరిస్తోంది. పటాన్ని చూసినా గగుర్పాటు చెందుతాం.

మొండెం బ్రతికి ఉండడమేమిటి? ఖండింపబడిన శిరస్సు తన చేతిలోనే ఉండడమా? తన రక్తాన్ని తాను త్రాగడమా? ప్రక్కనున్న యోగినుల నోళ్లల్లో ఆ రక్తధారలు పడడమా? సాధకునిలో ఈ రూపం ఏ మార్పుని తీసికొని వస్తుంది? మనకు అర్థం కాని వాటిని పట్టించుకోం సరికదా! తక్కువగా కూడా అంచనా వేస్తూ ఉంటాం. ఈ రూపాన్ని చూసి కొందరు క్షుద్రదేవత అన్నారు. గ్రామదేవతగా పరిగణించారు. ఇది వామాచారానికి సంబంధించినదని కొందరు ఈసడించారు. దుర్దేవతయని గొంతెత్తి చాటారు.

కాని తంత్రం... ఆ దేవతకొక పూజావిధానాన్ని, మంత్రాన్ని ప్రసాదించింది. కాని ఈ విద్యలో దాగిన పరమార్థాన్ని వెల్లడించలేదు. కాని అంతరార్థం లేకుండా ఉండదు.

సిద్ధపురుషులైన కావ్యకంఠ గణపతి మునులు కఠోరసాధన చేసి ఈ తత్త్వాన్ని బుద్ధితో తెలుసుకోవడమే కాక ప్రత్యక్షానుభూతిని పొందారు. తాననుభవించి, ఈ విద్యను సూత్రాలలో వెల్లడించారు. వారు బ్రతికి యుండగానే వారి శీర్షకపాలాలు వేరు చేయబడ్డాయి. చనిపోయిన వానికి కపాల మోక్షాన్ని శ్మశానంలో చూస్తాం. సన్యాసి జీవితంలో కపాలమోక్షం జరుగకపోతే అతడు పోయిన తరువాత నెత్తిపై కొబ్బరికాయలు కొడతారు. కాని బ్రతికియుండగానే ఇది జరగడం, తరువాత కొంతకాలం బ్రతకడం

గణపతిగారి జీవితంలో జరిగింది. అది కూడా రమణమహర్షి సన్నిధిలో జరిగింది. ఇక తత్త్వాన్ని తెలుసుకుందాం.

సృష్టికి ముందు నాదప్రకాశాలుంటాయని తెలుసుకున్నాం. ప్రకాశము ఆకాశంగా పరిమితమైతే ఆమెనే భువనేశ్వరి అన్నాం. అది కాలరూపాన్ని చెందితే కాళియని పిలిచాం. ఆ ప్రకాశమే సృష్టిలో అంతర్భూతమై, దానిని వెలువరించినపుడు సుందరి అని పిలిచాం. వ్యక్తీకరింపబడని అవ్యక్తమైన గడ్డకట్టిన నాదశక్తిని భైరవి అని భావించాం. ఆ నాదమే చూచినపుడు తార అని పిలిచాం. ఇక సృష్టి నిమిత్తం ప్రకాశ, నాద, కాంతులు ఒకదానిపై ఒకటి పనిచేస్తూ ఉండే దశను తాంత్రికులు 'ఛిన్నమస్త' యని పిలిచారు.

పరబ్రహ్మ యొక్క ఒకదానికొకటి సరితూగే సత్+చిత్+ఆనందాలు... మూడు భువనాలుగా మారగా దానిని పరార్థమన్నారు. అది ఊర్ధ్వ అర్ధగోళాకారం. అవి క్రిందకు అవతరించినపుడు పృథ్వి, అంతరిక్షం, ద్యులోకంగా మారాయి. ఇది క్రిందనున్న అర్ధగోళాకారం. ఇవి అన్న ప్రాణ మనస్సులకు చెందినవి. ఒకదానిపై ఒకటి పనిచేసే కాంతినాదాల తీవ్రత ఈ రెండు అర్ధగోళాలను ఒకదాని కొకటి నుండి దూరం చేసే రీతిలో ఉంటుంది. తాను పెక్కుగా కావాలని అనే పరమేశ్వర సంకల్పం నెరవేరిందా! అన్నట్లుగా ఒకటి నానారకాలుగా మారుతోంది.

ఒక దశలోనే తల్లి, పిల్ల ఏకంగా ఉన్నట్లు కన్పిస్తారు. ఒక దశలో విడివిడిగా ఉన్నట్లు కన్పిస్తారు కదా! ఈ పూర్వాపరాలు వేరు చేసే స్థితియే ఛిన్నమస్త. ఆ కాంతినాదాల తీవ్రత మన ఊహకు అందని విషయం. అది మూల కారణాన్ని చీల్చిచెండాడి దూరంగా విసిరివేసే శక్తి. ఒక దానిపై ఒకటి ఆధారపడిన కాంతినాదాల నుండే ఉరుములు, మెరుపులు. ఛిన్నమస్త గర్జించే ఉఱుము విద్యుత్ యొక్క వెలుగు. కనుకనే ఆమెను మంత్రపుష్పంలో "విద్యుల్లేఖేవ భాస్వరా" అన్నారు. కనుక ఆమె వజ్ర వైరోచనియే. ఆమె విరోచనునకు సంబంధించింది. విశేషేణ రోచతే ఇతి విరోచనః. అతడు ప్రకాశస్వరూపుడైన ఇంద్రుడే. వజ్రాయుధధరుడు. ఆ వజ్రశక్తియే ఛిన్నమస్త.

ఎవరీ ఇంద్రుడు? పురాణాలలో వినబడే ఇంద్రుడా? వేదంలో "విశ్వస్మాత్ ఇంద్ర ఉత్తరః" అని ప్రశంసింపబడ్డాడు. అనగా అన్నింటి కంటే పరమమైనవాడు. పదార్థ-జీవ శక్తులకు అధిపతి. ఇంద్ర-వృత్రుల యుద్ధం పెక్కు మంత్రాలలో ఉంది. వృత్రుడు మేఘుడని నిఘంటుకారులంటే, త్వష్ట యొక్క కొడుకని పురాణవేత్తలంటారని, నీరు-తేజస్సుల

కలయిక వల్లనే ఇంద్ర-వృత్రుల యుద్ధవర్ణన లేర్పడ్డాయని, ఇంద్రుడనే తేజస్సుచే, వృత్రుడనే మేఘం యొక్క గర్భంలో ఉన్న నీరు కొట్టబడి వర్షం ఏర్పడుతోందని 'యాస్క నిరుక్తం'పై దుర్గాచార్యులు వ్యాఖ్యానించారు. చీకటి నుండి తేజస్సును, వక్రమార్గం నుండి ఋజుత్వాన్ని, అసత్యం నుండి సత్యాన్ని, మేఘం నుండి అమృతధారలను కురిపించే వాడే ఇంద్రుడు.

మేఘాలకు వాయువు యొక్క రాపిడిని కలిగించడం, నీటిని వర్షింపజేయడం, నదులను ప్రవహింపజేయడం, ఇంద్రపరాక్రమాలుగా ఋగ్వేదంలో అనేక మంత్రాలలో ఉంది. వృత్రుడు చీకటిచే జగత్తును ఆవరింపగా, ఇంద్రుడు ద్యులోకంలో ఆదిత్యుని నిల్పినట్లు, తన కిరణాలచే మేఘాలను ప్రేరేపించినట్లు మంత్రాల వల్ల తెలుస్తోంది. మనలో సత్య, ఆనంద, అమృతత్వాలను కలిగించే శక్తులు దేవతలు. వాటిని అడ్డగించువారే రాక్షసులు లేదా వృత్రులు.

ఇంద్రుడు శత్రువులను భయపెట్టడమే కాదు... **ఇంధ ఇతీంద్రః** = సమస్త ప్రాణులలో చైతన్యరూపంగా ఉండి ప్రకాశింపచేస్తున్నాడు. ఇది **పరమైశ్వర్యే** = పరమైశ్వర్యం కలవాడై, **ఇరాం దదాతి** = వర్షాన్ని పుట్టించి అన్నాన్ని ఇస్తూ, **ఇదం కరణాదింద్రః** = జగత్తును నిర్మిస్తూ, **ఇదం దర్శనాదింద్రః** = పరబ్రహ్మను లేదా అన్నింటిని చూస్తూ పరమేశ్వరుడై భాసిస్తున్నాడు. ఇవన్నీ నిరుక్తంలో ఉన్నాయి. విపులంగా భారతకథలు అంతరార్థంలో వ్రాశాను. ఇవన్నీ ఇంద్రశక్తికి చెందుతాయి కనుక విపులంగా వ్రాయవలసి వచ్చింది.

ఆపైన అయిదు కర్మేంద్రియాలతో, అయిదు జ్ఞానేంద్రియాలతో పనులు చేస్తున్నాం కదా! పదునొకండవ ఇంద్రియం మనస్సు. దానిని నడిపించేవాడే ఇంద్రుడు. మనలో ప్రధానమైనది కామం. ఆ కామానికి అధిపతులు రతీమన్మథులు కదా! వారిపై ఛిన్నమస్త నిలబడిందంటే ఇంద్రశక్తి వారిని అదుపులో పెట్టిందనే కదా అర్థం? ఇలా ఈమె ఇంద్రియ శక్తులను నియమిస్తున్నట్లు 'ప్రచండ చండీత్రిశతి'లో గణపతిమునులు వ్రాశారు.

**యత్ తవాసనమశేష మోహనౌ**
**విద్యుదక్షిరతిసూనసాయకౌ**
**ఏతదింద్రసఖి భాషతే త్వయా**
**తావుభావపి బలాదధః కృతౌ**

ఈమెకు, కాళికి గల సంబంధం ఏమిటి? కాళిచర్యలూ భయంకరమైనవే. కనుకనే ఆమె చండి. కాళి కంటే భయంకరమైనది ఛిన్నమస్త. ఈమె ప్రచండచండి. సామాన్యంగా

పరిణామాలను కల్పించే విద్యుచ్ఛక్తి కాళి. ప్రభువు యొక్క ఆయుధభూతమగు విద్యుచ్ఛక్తి అనగా శాసించేది ప్రచండచండిక అని సూత్రాలు.

**సామాన్యతః పరిణమయిత్రీ విద్యుచ్ఛక్తిః కాలీ.**
**ప్రభోరాయుధ భూతా ప్రచండచండికా.**

కనుకనే ఈమెను 'వజ్రవైరోచనీయా' అని పిలుస్తున్నారు. అనగా వజ్రాన్ని ప్రకాశింప చేసే శక్తి. వజ్రమే ప్రభువు యొక్క ఆయుధం. ఆలస్యం చేయదు. విద్యుత్‌శక్తి కదా! కాళి ప్రాణశక్తి. కాళి జీవుల హృదయాలలో ఉంటుంది. ఛిన్నమస్త శీర్షంలో ఉంటుంది. మన శరీరంలో ఆజ్ఞాచక్రంలో అనగా కనుబొమల నడుమ ఉంటుంది.

మన శరీరంలో అనేక నాడులున్నాయి. అందు శక్తి ప్రవాహం ఉంటుంది. బ్రహ్మాండంలో వజ్రవైరోచనీ శక్తి యుండగా అది జీవులలో బ్రహ్మరంధ్రం గుండా అవతరిస్తుంది. ఇదే నాడులలోని విద్యుత్‌శక్తి ఈ నాడులలో ముఖ్యమైనవి మూడు. అవి ఇడపింగళసుషుమ్నలని చదువుకున్నాం.

సుషుమ్న వెన్నెముక నుండి బ్రహ్మరంధ్రం వరకూ వ్యాపిస్తుంది. దాని ప్రక్కనే ఇడా, పింగళ నాడులుంటాయి. మన ముక్కు రంధ్రాలలో ఉంటాయి. ఈ మూడూ కనుబొమల మధ్యలో ఆజ్ఞాచక్రంలో కలుస్తాయి. ఇదే త్రివేణీసంగమం. గంగా- యమునా-సరస్వతీ నదులు కలియు చోటు. ఇక్కడే ఛిన్నమస్త ఉంటుంది.

సుషుమ్న యందే ప్రచండచండిక వ్యవహారమని, కాళికి శరీరమంతటా వ్యవహారమని గుర్తించాలి. సుషుమ్న అనే నాడి మూలాధారం నుండి వెన్నెముక ద్వారా శిరస్సు వరకూ వ్యాపించి 'పశ్చాన్నాడి'యని పిలువబడుతోంది. అది శిరస్సును బొందిన పిదప శిరస్సు నుండి అమృతనాడియనే పేరుతో రొమ్ము వైపున నుండు హృదయమున వ్రేలాడుతుంది. ఇదే పురోనాడి. మనం ఇప్పుడు పశ్చాన్నాడీ విలాసం గురించి మాట్లాడుతున్నాం.

ఇక వర్ణిని, డాకిని అనే యోగినులే ఇడా-పింగళ నాడులు. ఛిన్నమస్త నుండి మూడు ప్రవాహాలని... ఒకటి తన నోట్లోనని, మిగిలినవి పై యోగినుల నోళ్లల్లో పడుతున్నాయని చదివాం కదా! ఈ మూడు నాడులలో మూడు శక్తి ప్రవాహాలకు సంకేతం. దానినే ప్రచండచండీ శతకంలో గణపతిమునులు ఇలా వ్రాశారు.

**సూక్ష్మనాడికా దేహధారిణీం ఘోరపాతక వ్రాతహారిణీం**
**చారు వర్ణినీ ప్రీతి లాలితాం భీమడాకినీ వీర్యనందితాం**

ఇడా నాడియే డాకిని. పింగళనాడియే వర్ణిని. ఛిన్నమస్తకు సుషుమ్న స్వాధీనంలో ఉంటుంది కనుక మస్తకం హస్తగతమైనట్లు భావించాలి. విగ్రహంలో ఆమె శిరస్సు ఆమె చేతిలోనే ఉంటుంది. మొండెం నుండి వెలువడే రక్తధారలు యోగసిద్ధి పొందిన యోగి యొక్క భ్రూమధ్యం నుండి వెలువడే అమృతధారలు. ఒక ధార శిరస్సు యొక్క తర్పణం కోసం అనగా సహస్రారమందు, మిగిలిన రెండూ ఇడా-పింగళులకు తర్పణం కొరకని అర్థం చేసుకోవాలి. తర్పణమనగా ఇక్కడ తడుపుట. ఇలా దేహమంతటనూ తర్పణం జరుగుతోంది. కఠోపనిషత్తు మంత్రాన్ని తిలకించండి-

**శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిఃసృతైకా**
**తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వంచన్యా ఉత్క్రమణే భవన్తి**

**తా:** హృదయంలో నాడులు నూటఒకటి ఉన్నాయి. వాటిలో ఒక నాడి మూర్ధస్థానాన్ని గూర్చి పోతోంది. దానినే సుషుమ్నా నాడియని అంటారు. ఈ నాడీ ద్వారం గుండా ప్రాణం పోతే వానికి అమృతత్త్వం లభిస్తుంది. మిగిలిన వంద నాడులు ప్రాణోత్క్రమణ ద్వారాలు కావని తాత్పర్యం.

కనుక బ్రహ్మరంధ్రంలో ఉన్న రంధ్రం గుండానే బ్రహ్మాండంలోని విద్యుత్‌శక్తి అవతరిస్తుంది. తరువాత అది మూతబడి యుంటుంది. ఇక అనంతశక్తితో దీనిని కలపడం సాధారణ జనులకు కుదరదు. కారణమేమనగా సుషుమ్నా మార్గంలో మూడు గ్రంథులు(ముడులు) ఉన్నాయి. ఇవి పై ప్రవాహాన్ని అడ్డుకొంటాయి. యోగి వీటిని మరల ఛేదించి అనంతశక్తి ప్రవాహానికి అడ్డును తొలగిస్తాడు. అవి ఛేదింపబడితే శక్తి బహుళంగా ప్రవహిస్తుంది. అవి తొలగిపోతే శరీరంలో సుషుమ్నానాడి, సమష్టి సుషుమ్నానాడితో కలిసి మహా మహిమతో విరాజిల్లుతుంది. సాధన పెరిగిన కొద్దీ బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులు... ఒకదాని తరువాత ఒకటి విడిపోతాయి.

రుద్రగ్రంథి భేదనం జరిగితే కైవల్యమే. కాశిలో మరణించే వారికి ముక్తి అంటే ఇదే! ఈ కాశి ఆజ్ఞాచక్రమే. ఇక్కడే రుద్రగ్రంథి భేదనం. కపాల భేదనానికి, ఈ రుద్రగ్రంథి భేదనానికి అనుబంధం ఉంది. ఛిన్నమస్త తన తలను తాను నరుక్కోవడమంటే ఈ రుద్రగ్రంథి భేదనమని అర్థం. ఆమె చేతిలో కత్తెర ఉంటుంది కదా! ఈ కత్తెరతోనే శరీరంలోని గ్రంథులను కత్తిరిస్తుంది. కంఠాన్ని ఉత్తరించుకోవడం అంటే మనస్సు యొక్క నాశమే. అంటే మనోధర్మాలైన సంకల్ప- వికల్పాలకు తెరపడినట్లే. అజ్ఞానాన్ని

కత్తిరించినట్లుగా భావించాలి. ఇది జరుగుతుందా! అని శంక. తైత్తిరీయ ఉపనిషత్తులో–

**అంతరేణ తాలుకే యఏషస్తన ఇవావలంబతే సేంద్రయోనిః**
**యత్రాసౌ కేశాంతో వివర్తతే, వ్యపోహ్య శీర్షకపాలే...** అనే మంత్రం ఉంది.

**తా:** హృదయం నుండి ఏ నాడి ఊర్ధ్వంగా వ్యాపించిందో దానికి సుషుమ్న అని పేరు. అది తాలుకల యొక్క మధ్యభాగంలో ఉంటుంది. అక్కడ మాంస పిండం స్తనం మాదిరిగా వ్రేలాడుతుంది. దాని మధ్యభాగం నుండి మూర్ధప్రదేశానికి ఛేదించుకొని బయలు వెడలిపోవుటయే పరమాత్మ ప్రాప్తి యొక్క మార్గం. ఇలా జీవితంలో ఇట్టి స్థితిని పొందినవారు గణపతిమునులు.

కనుక శీర్షికపాలాలను రెండిటిని భిన్నం చేయడమే ఛిన్నమస్తా తత్త్వం. మరణకాలంలోనే కాదు. బ్రతికియుండగానే కపాల విచ్ఛేదం కలిగినా యోగి జీవిస్తాడని సూత్రీకరించారు వారు. ఇలా జరిగిన తరువాత అమృతనాడి తెరువబడుతుందని వ్రాశారు.

ఇక పైలోకంలో ఈమె విలాసమెట్లా ఉంటుంది? దేవయానమార్గమే(మిల్కీ వే) ప్రచండ చండికా మార్గం. ఆ మార్గం ఆకాశం మీదుగా పుప్పొడిలా ప్రకాశించే రేణుమయ భాగం. ఆమె కర్మఫలభూతము నిచ్చేది.

**కర్మఫలేషు జుష్టా**

సాధకులు కాని వారికి ఆమె అందదు కనుక దుర్గ. ఆదిత్యమండలం మొదలుకుని మనలో నున్న సుషుమ్న వరకూ ఒక మార్గం ఉందని రశ్మిప్రవాహం ఉంటుందని, ఆ మార్గం అసంఖ్యాకమైన శాఖలు కలదని అందుండి రశ్మలు వస్తాయని, సుషుమ్న రశ్మలను క్రిందకు పొందిస్తుందని, ప్రాణాలకు ఊర్ధ్వగతిని పొందింపజేస్తుందని సూత్రీక రించారు. ఆ దేవయాన మార్గమే అంతరిక్షం. దానినే ఋషులు మహద్రజ మన్నారు. దానినే తాంత్రికులు రేణుక అని పిలిచారు. అనగా తేజస్సును రేణువులుగా విభజించేది. పరశురాముని తల్లి పేరు రేణుక. పై పరాశక్తి యొక్క అంశ. ఆమెను షష్ఠి అన్నారు. ఈ విద్యలలో ఈమె ఆరవది. అంత మాత్రమే కాదు, అవతారాలలో పరశురామావతారం ఆరవది. ఒక సందర్భంలో ఆమె మనస్సు కామ వికారాన్ని పొందగా జమదగ్ని ఆజ్ఞను పురస్కరించుకొని పరశురాముడు తన తల్లి తలను నరికాడు. తన ఆజ్ఞను పాటించినందులకు వరం వేడుకొనుమనగా తల్లిని తిరిగి బ్రతికించిన కథ ప్రసిద్ధం. ఆమెయే ఏకవీర. ఈ కథ మలిన మనస్సును నరికి శుద్ధమనస్సు నిచ్చినట్లుగా అర్థం చేసుకోవచ్చు.

ఈమె మంత్రం : "ఓం శ్రీం హ్రీం ఐం వజ్రవైరోచనీయే హూం హూం హూం ఫట్ స్వాహా"

లేదా 'హూం' అనే కూర్చ మంత్రంతో నైనా ఉపాసించవచ్చు.

ఇక శుద్ధోపాసన ఎలా? ఒక వస్తువును చూడాలంటే చూపు కావాలి కదా! వస్తువును చూడకుండా చూపుపై చూపు పెట్టడమే సాధన. కాంతి ఉంటే వస్తువు కనబడుతుంది. వస్తువుపై దృష్టి కాకుండా కాంతిపై దృష్టి పెట్టాలి.

**దృశ్యానశేషానపి వర్జయిత్వా దృష్టిం నిజాం సూక్ష్మమహః స్వరూపాం**
**నిభాలయేత్ యన్మనసా వరీయాన్ అన్యోఽ యమంబా స్మరణస్య మార్గః**

(ప్రచండ చండీత్రిశతి)

ఇదే మాట ఉమాసహస్రం(10 శత. 2 స్తబకం)లో చెప్పారు –

**దృష్ట్వా దృష్ట్వా ద్రష్టుశ్శక్తిం లోచనమండలమధ్యే భాంతం**
**అవిముంచన్యః పశ్యతిధీరో యత్కించిద్వా తమవత్యైంద్రీః**

**తా:** ప్రతి దృష్టిలో చూచేవాని శక్తిని అనగా చూడబడే దానిని విడిచి చూచేశక్తిని అనగా భ్రూమధ్యంలో భాసించే దానిని ఎల్లప్పుడూ ఎవడు చూస్తాడో అతడు వజ్రవైరోచని యొక్క అనుగ్రహాన్ని పొందుతాడు. లేదా అంతరిక్షం నుండి మనయందు ప్రవహించే శక్తిని ధ్యానించగలగాలి. ఈ మాట పై త్రిశతిలో ఉంది.

**తటజ్ఝరీం కామపి సంప్రపశ్యన్ ఆకాశతః సర్వతనౌ పతంతం**
**మానేన తిష్ఠేద్యమినాం వరిష్ఠో యద్యేతదంబా స్మరణం ప్రశస్తమ్**

ఈ విద్య కూడ బృహదారణ్యక ఉపనిషత్తులోని జ్యోతిర్విద్యకూ సంబంధముందన్నారు గణపతిమునులు. దీనిని జనకమహారాజుకు యాజ్ఞవల్క్యమహర్షి ఉపదేశించాడు.

దేని వల్ల మనం పనులను చేసుకొంటున్నాం? వెలుగు వల్లనే కదా! ఆ వెలుగేది? సూర్యుడు. ఇతడు అస్తమిస్తే దేనివల్ల? చంద్రుని వల్ల. ఇతడూ అస్తమిస్తే దేనివల్ల? దీపం వల్ల. దీపం ఆరిపోతే దేనివల్ల? వాక్కు వల్ల. మేల్కొన్నపుడు వాక్కు వల్ల వ్యవహారం జరుగుతోంది. స్వప్నంలో మాటేమిటి? ఆత్మవస్తువే అక్కడ ప్రకాశం. మేల్కొన్నపుడూ ఆత్మప్రకాశమే. గాఢనిద్రలో కూడా సాక్షిరూపంలో ఆత్మ ప్రకాశిస్తూనే ఉంది. ఈ ఆత్మ జ్యోతిస్సు ఆదిత్యాది వెలుగుల కంటే భిన్నం. అభౌతికం. అది స్వయంజ్యోతి. సర్వోత్కృష్టం అని వివరంగా చెప్పాడు.

"యథాకేశః సహస్రధా...." అనే మంత్రం ఉంది.

**తా:** హృదయం నుండి నాడి ఊర్ధ్వముఖంగా వెళుతోంది. ఒక వెంట్రుకను వేయి భాగాలుగా చేసినంత సూక్ష్మంగా ఉంటుంది. దేహానికి సంబంధించిన నాడులు 'హితాః" అనే నామం కలవై హృదయ మాంసపిండంలో ప్రతిష్ఠింపబడియున్నాయి. ఆ హృదయదేశం నుండే ఈ సూక్ష్మనాడుల ద్వారా అన్నరసం స్రవించి ఆయా దేవతా శరీరాలను పోషిస్తోంది. స్థూల శరీరాన్ని సూక్ష్మశరీరాన్ని పోషిస్తోందని తాత్పర్యం.

కనుక ఛిన్నమస్త యొక్క వజ్రవైరోచనీయ శక్తిని, శరీరంలో అనేక శాఖలుగా విస్తరించిన సుషుమ్నా నాడీ శక్తిని, అనంతజ్యోతినీ భావిస్తే పై విద్యకు సంబంధం తెలుస్తోంది. కదా!

గణపతిమునులు వ్రాసిన ఈ దిగువ శ్లోకాన్ని(ఉమాసహస్రం) పఠించండి. 'మనకొచ్చే కష్టాల నుండి దాటాలంటే ఈ శ్లోకాన్ని తప్పక పఠించా'లని శ్రీ మహావ్రతయాజుల సూర్యనారాయణశాస్త్రిగారు కొన్ని వందలసార్లు చెప్తూ ఉండేవారని వారి తనయులు చెప్పారు.

**తవచ్ఛిన్నం శీర్షం విదురఖిల ధాత్ర్యాగమవిదో**
**మనుష్యాణాం మస్తే బహుల తపసా యద్విదలితే**
**సుషుమ్నాయాం నాడ్యాం తనుకరణ సంపర్కరహితా**
**బహిశ్శక్త్యా యుక్తా విగతచిరనిద్రా విలసతి** (7 శత. 3వ స్తబకం)

దీని భావాన్ని లోగడ వివరించా... అయినా, పారాయణ చేసేవారికి మరల వ్రాస్తున్నా-

**తా:** తీవ్ర తపోనిష్ఠ వల్ల మానవ శిరస్సు బ్రద్దలవుతుంది. శరీరంలోని సుషుమ్నా నాడి నుండి ప్రవహించే శక్తి అనంతశక్తితో కలిసి రాకపోకలు జరుపుతుంది. కనుక ఆగమవేత్తలు ఆ ప్రవహించే శక్తిని ఛిన్నమస్త అని పిలిచారు. ఆ శక్తి నిద్రను విడిచి మేల్కొన్న కుండలినియే.

చివరి మాట... వీరసాధకులకే ఈమె వశమౌతుంది. **వీర – విశేషేణ ఈరయతి ఆత్మానం ఇతి వీరః** = అనగా ఇంద్రియ నిగ్రహం కలవారు వీరులు. వారికే దక్కుతుంది.

ధూం

# ధూమావతి

**ఏ**డవ మహావిద్య **ధూమావతి.**

ముమ్మొదట చీకటిగర్భంలో చీకటి దాగి ఉంది–

**తమ ఆసీత్ తమ సా గూహ్ల మగ్రే అప్రకేతం సలిలం సరస్వ మా ఇదం** – ఋక్. 10.129.3

మొట్టమొదట అంతా అసత్తే. దాని నుండి సత్తు పుట్టింది.

**అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత** – తైత్తిరీయ. ఉప. 2.7

ముందు అసత్తే ఉంది. అది సత్ అయినది–

**అసదేవేద మగ్ర ఆసీత్, తత్ సదా సీత్ తత్ సమభవత్** – ఛాందోగ్య 3.19.1

మొదట శూన్యమే ఆవరించింది–

**నైవేహ కించనాగ్ర ఆసీత్** – బృహదారణ్యాక. ఉప. 1.1.2

ఇలా అనేక పంక్తులు ఉపనిషత్తులలో లభిస్తాయి. అసత్తు నుండే సత్తు వచ్చినట్లు, మళ్లీ అసత్తులోనే లీనమౌతున్నట్లుంది. ఈ మొదటి స్థితి సృష్టి తరువాత జరిగే ప్రళయంలోనూ ఉంటుంది. దీనినే తాంత్రికులు ధూమావతియని పిలిచారు. ఈమె సృష్టి ఆరంభానికి ముందు, దేవతల కంటే ముందుగా వర్ణింపబడింది: **"దేవానాం పూర్వే యుగే"**

పెద్దదానిగా 'జ్యేష్ఠ'గా వర్ణింపబడింది. మొదటి తమస్సగుట వల్ల జ్యేష్ఠ, ప్రళయంలో ఈమె స్వరూపం ధూమ్రవారాహి. అనగా పొగరూపంలో భువనాలను మ్రింగే శక్తిగా వర్ణింపబడింది.

అసత్తు నుండి సృష్టి పుట్టడమేమిటి? అసత్తు కేవలం శూన్యమా? అది బుద్ధమతం చెప్పే నిర్వాణమా?

ఇక్కడ అసత్ అనగా అసలే లేదని కాదు. సృష్టిలో నామరూప విశేషాలున్నాయి కదా! దీనిని వ్యాకృతమని అంటారు. దీనికి విరుద్ధమైంది అవ్యాకృత బ్రహ్మము. అనగా వ్యక్తీకరింపబడని స్థితి. అంతేనే కాని అసలే లేదని కాదు. బొత్తిగా అసలే లేని వస్తువు నుండి సత్తు (ఉన్నది) పుట్టదు కనుక. అనగా సృష్టికి పూర్వం అసత్ అనే శబ్దంతో

చెప్పబడే బ్రహ్మమే ఉంది. అట్టి అసత్తు నుండి ఈ కనబడే నామరూపాలతో కూడిన సృష్టి పుట్టిందని పై తైత్తిరీయ మంత్రానికి అర్థం.

ప్రపంచమంతా సృష్టికి పూర్వకాలంలో దీనికీ పేరు, ఇది ఫలానా వస్తువు అనే - విభజన లేకుండా అవ్యక్తంగా అనగా కనబడకుండా శూన్యంలా ఉందని పై ఛాందోగ్య మంత్రానికి అర్థం.

పై బృహదారణ్యక మంత్రం గురించి 'నైవ ఆసీత్' అని చెప్పడం వల్ల సృష్టికి పూర్వం ఏమీ లేదు, అంతా శూన్యమే, అసద్రూపమే అని బౌద్ధులంటారు. కార్యం కాని, కారణం కాని ఏదీ లేదని వారి అభిప్రాయం. అంతేకాక ఘటం పుడుతోంది అంటే అంతకు పూర్వం లేదనే కదా! దాని భావం అని వారి వాదం.

ఘటం పుట్టడానికి ముందు ఘటం లేదు కాని, దానికి కారణమైన మట్టి ఉంది కదా. కనుక కారణమైన మట్టి ఉంది. కారణం లేకపోలేదని అసత్కార్యవాదులంటారు.

కుందేటికి కొమ్ము లేదు. కనబడడం లేదు కనుక అన్నట్లు సృష్టికి పూర్వం ఏదీ కన్పించడం లేదు కాబట్టి కార్యం లేదు, కారణం లేదని బౌద్ధుల వాదన.

ఈ సృష్టి, పూర్వం కారణరూపంచే కప్పబడియుందని, కార్యమైన జగత్తు, కారణమైన వస్తువూ రెండూ ఉన్నాయని మనం అంటాం. రెండూ సద్రూపాలే అని, కార్యం, కారణం రెండూ లేకపోతే గొడ్రాలికి కొడుకు, ఆకాశంలో పుష్పం అన్నట్లు అసందర్భంగా ఉంటుందని.

కుండను చేసేవాడు మట్టిని తెచ్చుకొని చేస్తున్నాడు. కార్యం పుట్టిందంటే కారణం ఉండి తీరాలి కదా ! కనుక కారణం లేదని బౌద్ధులనడం మనకు సమ్మతం కాదు.

మట్టిముద్ద నష్టమైతే కుండ పుట్టింది. కాబట్టి శూన్యం నుండి కార్యం పుట్టిందని బౌద్ధులు వాదిస్తారు. కుండకు మట్టి కారణం కాని మట్టిముద్ద కాదు. ముద్దగానున్న మట్టి ఆ ముద్ద దశను వదలి కుండకు కారణమౌతోంది. కుండ తయారయిన తరువాత కుండలో నున్నది మట్టే కదా! కాబట్టి కార్యం పుడితే కారణానికి నాశనం చెప్పడం పనికిరాదని మనం అంటాం.

కాబట్టి కార్యం పుట్టడానికి ముందు కారణంలో కార్యం ఉందని అంగీకరించడం సబబు. పుట్టుకకు పూర్వం కార్యం లేదనడం సబబుకాదు. చీకట్లో కుండ ఉంటే దీపం వల్ల కుండను చూస్తున్నాం. అంతకు ముందే చీకట్లో కుండ ఉన్నట్లే కదా! అలాగే ఈ

జగత్తు నామరూపాలతో లేనపుడు అనగా వ్యక్తీకరింపబడనపుడు 'సత్' ఉందని చెప్పాలి లేదనకూడదు. మట్టి, ముద్దగా ఉన్నపుడు కుండను మట్టిముద్ద ఆవరించి ఉంది. కనుక ఆ దశలో కుండ కనబడడం లేదు. అంటే కుండ అవ్యక్తంగా ఉంది. కనబడకుండా ఉండే దశను తొలగించి కుమ్మరి సాధనాల ద్వారా కనబడేటట్లు చేస్తాడు.

అసలు అభావాలే నాలుగు రకాలు. (1) ప్రాగభావం, (2) ప్రధ్వంసాభావం (3) అత్యంతాభావం (4) అన్యోన్యాభావం. కుండ తయారు కానపుడు ముందది లేదు కదా – అట్టి దశ ప్రాగభావం. తయారు చేయబడిన కుండ బ్రద్దలైతే ప్రధ్వంసాభావం. గాలికి రూపం లేదనే మాటలో గాలికి ఎప్పుడూ ఏ కాలంలోనూ, ఏ దేశంలోనూ రూపం ఉండదు కాబట్టి అత్యంతాభావం. కుండ బట్ట కాదు, బట్ట కుండ కాదు అనే చోట అన్యోన్య అభావం.

అసలు అభావమనే పదార్థమే లేదని, అభావాలన్నీ భావస్వరూపాలే అని మనం అంటాం.

కుండ పుట్టడానికి ముందు అసలు కుండ స్వరూపం లేదని చెప్పకూడదని, అది మట్టి రూపంలో ఉందని చెప్పాలి. విత్తులో చెట్టు ఉందా! లేదని అంటాం వెంటనే. కాని బహు సూక్ష్మరూపంలో ఉంది. విత్తులో అసలు చెట్టే లేకపోతే కొంతకాలానికి ఆ విత్తు నుండి చెట్టు ఎలా పుడుతోంది? కనుక ఒక దశలో లేనట్లుగా కన్పిస్తోంది. ఒక దశలో కనబడుతోంది. కనుక అసత్తు (లేనిది) అంటే ఉన్న దాని యొక్క (సత్) కనబడని దశగానే అర్థం చేసుకోవాలి. కనుక ఆ అసద్రూపంలో ధూమావతి ఉంటుంది.

ప్రళయదశలో లేనట్లుంటుంది. ఒక రాజు పోయి ఇంకొక రాజు రాజ్యమేలకుండా ఉన్న మధ్యకాలంలా ఉంటుంది. సృష్టికి సిద్ధపడినపుడు నామరూప జగత్తుగా విస్తరింప బడినప్పుడు ఉన్నట్లుగా ఉంటుంది. సృష్టి వ్యాపారం లేనపుడు లేదా సృష్టికి సిద్ధపడనపుడు అసత్తుగానే ఉంటుంది. లేని దాని నుండి ఉన్నది పుడుతోందనే మాటను వివరించా ననుకుంటా. కనుక ఈ అసద్రూప శక్తియే ధూమావతి. చీకటి గర్భంలో చీకటిగా ఉందంటే ఇలాగే.

ఆమె ధూమావతి కదా! కాంతిని కనే చీకటి గర్భంలో ఉన్న గర్భవతి. నిప్పురవ్వలు దాగిన పొగ.

వేదంలో... రాత్రి ప్రతినిధిగా అసత్తు వర్ణింపబడింది. జగత్తునకు నివేశనమగుచున్న రాత్రిని ఆహ్వానిస్తున్నామని మంత్రం –

**హ్వాయామి రాత్రిం జగతో నివేశనీ**

రాత్రి యందే సమస్త జగత్తులున్నట్లు మంత్రం -
**రాత్రి జగతో నివేశాని** - ఋక్ 1.35.1

ఒక జలప్రళయంగా, అన్నింటిని కప్పుదానిగా రాత్రి వర్ణింపబడింది -
**అప్రకేతం సలిలం** - ఋక్. 10.129.3

వేద మంత్రాలను బట్టి ఒకటి ఊర్ధ్వార్ణవం. రెండవ సముద్రం మనకు కనబడేది. ఈ రెండు సముద్రాల మధ్య జగత్తు.

మనకు కనబడే ప్రపంచం పుట్టడానికి కారణమైన కోరికను అవ్యక్తంలో తెలుసుకున్నారు ఋషులు. ఈ అవ్యక్తం అనగా వాంఛకు కారణమైన దానిని కనుగొన్నారని మంత్రం.

**సతో బంధుమసతి నిరవిందన్, హృది ప్రతీష్యా కవయో మనీషేతి** - ఋక్. 10.129.4

తంత్రం... ధూమావతిని చిక్కని రాత్రిగా, మహారాత్రిగా, ప్రళయరాత్రిగా పేర్కొంది(చూ. దేవీమాహాత్మ్యం). పురాణాలలో ఈమె నిద్ర... విష్ణువు యొక్క యోగనిద్ర. ప్రళయాంతంలో విష్ణువు ఈ సృష్టి నుండి దూరంగా ఉంటూ, అనంతునిపై శయనిస్తూ, ఆనందమనే మధుర క్షీర సముద్రంలో పవళిస్తాడని పురాణాలంటాయి. అదే యోగనిద్ర. అది రాబోయే మేల్కొను దశకు అగ్రగామి. అనగా సృష్టి కార్యానికి ఉపయోగపడే నిద్ర. కనుక ధూమావతి... ఈ సృష్టిని గర్భంలో ధరించి, మరల సృష్టి వ్యక్తీకరింపబడుటకు దోహదపడుతుంది.

అసత్తు నుండి సృష్టి రాగా, అనగా సృష్టి మొదలిడగా ఈ సృష్టి అంతా సత్తుతోనే నిండిందని, ఇక అసత్తు యొక్క స్పర్శ లేదని భావించకూడదు.

పరమేశ్వరుడు సృష్టించడమే కాదు, ఇందులో ప్రవేశించాడని లోగడ మంత్రంలో చదువుకున్నాం. అంటే అతడు ఉపాదాన (ప్రధాన) కారణం, నిమిత్తకారణం కూడా. కుండకు మట్టి సమవాయి లేక ఉపాదాన కారణం. రెండు మట్టి పచ్చి పెంకుల్ని కలపడం అసమవాయి కారణం. కుమ్మరిచక్రం, దండం, నీరు మొదలైనవి నిమిత్త కారణం.

సృష్టిలో సత్-అసత్ రెండు రూపాలున్నాయి. ఈ అసత్తు నుండి సృష్టి రావడం ఎప్పుడూ జరిగేదే. ఇక్కడ అసత్తే చీకటిలోని చీకటి. ఈ అసత్తు నుండే అవిద్య, అసత్యం, క్రౌర్యం, పాపం, బాధ వస్తాయి. సృష్టి వెంట ఇవీ ఉంటాయి. అవిద్య అంటే విద్యకు పూర్తిగా భిన్నమైనదని భావించవద్దు. **విద్యాయాః అభావః** అని కాదు. **"ఈషత్ ఊనా విద్యా"...**

విద్య కంటే కొంత తక్కువదని అర్థం చేసుకోవాలని తాంత్రికులంటారు. దీని నుండే పై లక్షణాలు. కనుక వేదం రాత్రిని అసత్తుగా చెప్పిందంటే పై లక్షణాలు కలిగినదని.

కనుకనే ధూమావతిని అక్రమస్థితికి మార్చేదానిగా, విరూపం చేసేదానిగా, వక్రీకరించే దానిగా వర్ణించారు. కనుక ఆమె వికృతంగా ఉంటుంది. పాలిపోయిన ముఖంతో, దీర్ఘాంగాలతో, మలినాంబరంతో, విరబోసుకున్న జుట్టుతో, జారిపోవు స్తనద్వయంతో, వార్ధక్యంచే బలముడిగిన దానిగా విరళమైన పండ్లతో, అసహ్యంగా, కాకధ్వజంతో, తీవ్ర దృక్కులతో, విధవరాలుగా, చేతిలో చేటతో, ఒక చేతితో వరాలనిచ్చేదానిగా, రథం ఎక్కినదానిగా వర్ణించారు.

**వివర్ణా చంచలా దుష్టా దీర్ఘాచ మలినాంబరా**
**విముక్త కుంతలా రూక్షా విధవా విరల ద్విజా**
**కాకధ్వజరథారూఢా విలంబిత పయోధరా**
**శూర్పహస్తాతి రూక్షాక్షా ధూతహస్తవరాన్వితా**

ఈమెను సూచించే దురిత(పాపం) దుస్స్వప్నాలకు తోడు ఈమె దుష్టగా వర్ణింపబడింది. శక్తి ఉన్నచోట శక్తుడు ఉంటాడు. మహాకాళికి మహాకాలుడు, తారకు అక్షోభ్యుడు, భైరవికి భైరవుడున్నారు. త్రిపురసుందరి విషయంలో శక్తి-శక్తులకు అవినాభావ సంబంధం ఉంది. ఇద్దరూ ఒక్కరేనని. కాని ధూమావతికి మాత్రం భర్త లేడు. ఆమె విధవగా ఉంటుంది. పరమ పురుషుడు యోగనిద్రలో ఉండగా శక్తి చుట్టచుట్టుకొని నిద్రిస్తున్నట్లుండగా శక్తి యొక్క ఉపయోగం లేనట్లున్న స్థితిని విధవతో పోల్చారు. ఆమెలో స్పందన కలిగినపుడు ప్రకృతియని పిలువబడుతుంది.

**ప్రకృష్ణవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః**
**సృష్టాపృకృష్టా యా దేవీ ప్రకృతిః సా పరికీర్తితా**

అప్పుడు ఆమెకొక పురుషుడుంటాడు. సాక్షిగా ఉంటాడు. ఆమెను సహిస్తాడు. ఆమెను నియమించగలడు, ఆమెపై ప్రభుత్వాన్ని చూపగలడు. సాక్షి, అనుమంత, ఈశ్వర పదాలకది అర్థం. ధూమావతికి విరుద్ధం కమలాత్మికావిద్య.

ఇక ధూమావతి మిగిలిన దేవతల కంటే ఎలా భిన్నమైంది? భైరవి తపశ్శక్తికి ప్రతినిధి. క్రియాశక్తిని విడుదల చేయడానికి సిద్ధంగా ఉంటుంది. ధూమావతి స్తబ్ధతకు మారుపేరు. ఇక కాళి కాలానికి మారుపేరు. సృష్టిలో జరిగే మార్పులు ఈమె వల్లనే. సత్తు దాగిన అసద్రూపం ధూమావతి.

'అసత్తు నుండి సత్తుకు, చీకటి నుండి వెలుగునకు, మృత్యువు నుండి అమృతత్వానికి మమ్ములను తీసుకొని పొమ్ము' అనే ప్రార్థన ఇక్కడే పనిచేస్తుంది.

**అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ,**
**మృత్యోర్మా అమృతం గమయ** – బృహ. ఉ. 1.3.28

సంసారంలో చిక్కుకున్న వారిలో నిద్ర, మూర్ఛ, మరపు రూపాలతో ఉంటుందని చదివాం కదా! ఏ అజ్ఞానం వల్ల సంసారులు ఆత్మను తెలియకుండా ఉన్నారో, ఆ అవిద్యారూపిణిగా ఉంది. మాయ కంటె వేరైనది అవిద్యయని, ఏకమై ఉన్న ఆత్మను బహువిధాలుగా చూపించేది మాయయని, ఎప్పుడూ ఉన్న ఆత్మస్థితిని మరపు చేసి, అసత్తు నందు ఆత్మభ్రాంతిని కలుగచేసేది అవిద్యయని సూత్రీకరించారు.

**అవిద్యా మాయతో విలక్షణా**
**యయైకం బహుధా పశ్యంతి సా మాయా**
**యయా సంతం న పశ్యంతి సాత్వవిద్యా.**

ఈ సృష్టి అంతా మాయయని అంటాడు అద్వైతి. ఈ అవిద్యారూపిణి కాళ్లు పట్టుకోవాలంటాడు తాంత్రికుడు. చేపలు పట్టేవాడు కొంత దూరంగా ఉన్న చేపలను పట్టగలడు. కాళ్ళ దగ్గర పడియున్న చేపలను పట్టగలడా? పాపాలతో, బాధలతో కూడిన జగత్తు యొక్క మూలాన్ని అన్వేషించాలని అంటాడు తాంత్రికుడు. ఇది బౌద్ధులు చెప్పే శూన్యం కాదని చెప్పాం కదా! అద్వైతుల మాయను తాంత్రికులు అంగీకరించరు. జగత్తు నుండి తప్పుకోవడం కాదని, బౌద్ధుల శూన్యంలోకి చొరబడడం కాదని జగత్తు సత్యమేనని వీరంటారు. అసత్తులో దాగిన సత్యాన్ని పట్టుకోవాలని చైతన్యరహితమైన దాంట్లో చైతన్యాన్ని, బాధలలో దుఃఖాలలో దాగిన ఆనందాన్ని అన్వేషించాలంటారు.

రాత్రికి అధిష్ఠాన దైవమైన వరుణుని భార్య వరుణాని ఈ విద్యకు అధిదేవత. విశ్వాన్ని స్మృతి నుండి పారద్రోలాలని భావించేవాడు ఈమెను ఉపాసించాలి.

**సూత్రం: విశ్వోచ్చాటన కామో ధూమావతీముపాసీత**

ఈమె మంత్రం – "ధూం ధూం ధూమావతి స్వాహా"

ఏకాంత గృహంలో లేదా ఒక జీర్ణమైన గృహంలో గాని స్థిమిత మనస్సుతో ఇంద్రియ వ్యాపారాలను కట్టిపెట్టి ధూమావతిని ఉపాసించాలిట.

జడత్వం, నిద్ర, భ్రాంతి రూపాలతో ఉండే ధూమావతి సాధకుని మారుస్తుంది. నిద్ర యోగనిద్ర అవుతుంది. నిద్ర సమాధిగా మారుతుంది.

మహాప్రళయం ఎప్పుడో కాదు. దాని ప్రతినిధి నిత్యమూ జరుగుతున్నదే. పగలు తరువాత రాత్రి, మేల్కొన్న దశ నుండి నిద్ర – ఇదంతా ఒక రకమైన చావే కదా! ఒక రకమైన ప్రళయమే కదా! జీవితంలో సగభాగం నిద్రలోనే ముగుస్తోంది కదా! మేల్కొన్న దశలో చైతన్యంతో చేసిన పనులకు నిద్రలో స్వస్తి పలుకుతున్నాం. మరల మేల్కొన్నపుడు పనులు చేయడానికి నిద్రలో బలాన్ని పుంజుకొని చేస్తున్నాం. ఇదంతా ధూమావతి యొక్క అనుగ్రహమే. కనుక నిద్ర మన అభ్యుదయానికి ఆటంకం కాదు. పైపెచ్చు బలకారిణి అవుతోంది. కనుక నిద్రలో కూడా ఒక రకమైన సాధన కొనసాగుతోంది. రాత్రి–పగలు మాదిరిగా యోగుల జీవితాలలోనూ చీకటి – నిరుత్సాహం, వెలుగు–సంతోషం తొంగి చూస్తూ ఉంటాయి. సాధన మందగిస్తే నిరుత్సాహం, చురుకుగా సాగితే ఉత్సాహం.

కనుకనే పరమేశ్వరుని సంకల్పం అనే అల్పనిద్రా దశలో ప్రకృతి ఎట్లా పరిణమిస్తుందో అనే తాళం చెవిని గుర్తిస్తాడని యోగి అరవిందులు :–

»There in the slumber of the cosmic will
He saw the secret key of Nature's change" - Savitri 11.8

ఇక శుద్ధోపాసన ఎట్లా సాగుతుందనే ప్రశ్న. నిద్రాదులకు చెందిన అవిద్య పనికి రాదు. ఇక విద్య కూడా పనికి రాదు.

**విద్యాంచా విద్యాంచ యస్తద్వేదో భయగం సహ**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే"**– ఈశా: 11వ మంత్రం.

ఎవడు దేవతా జ్ఞానాన్ని(విద్య), కర్మ(అవిద్యను) కూడా కలిపి తెలిసికొంటాడో అతడు కర్మలను చేసి, మృత్యువును దాటి దేవతాజ్ఞానం చేత దేవత్వాన్ని పొందుతాడని అర్థం. అనగా కోరికలతో కూడిన కర్మలూ పనికి రావు. కర్మలను విడిచి దేవతాజ్ఞానమూ పనికి రాదు. ఇద్దరికీ దుఃఖమే. అనగా ఫలాన్ని కోరకుండా కర్మలను చేసి అట్టి అవిద్యతో చిత్తశుద్ధిని పొంది మృత్యువును దాటి దేవతను ఉపాసిస్తే ఫలమని తాత్పర్యం. కర్మలను విడిచి దేవతాజ్ఞానం కావాలని కోరేవాడు రెంటికి చెడిన రేవడి అవుతాడు.

అవిద్యారూపిణియైన దేవతను పై విధంగా ఉపాసిస్తే విషయాల నుండి విముక్తి కలిగిస్తుంది. ఉన్న దానిని (సత్) తన గర్భంలో దాచుకొన్నట్లుగా ధూమావతిని ఉపాసిస్తే ఆమె అమృతత్వానికి దారి చూపిస్తుంది. కనుక విద్యను, అవిద్యను కలిపి ఉపాసించాలి. కేవలం విద్య వల్ల కాని, కేవలం అవిద్య వల్ల కాని మోక్షం లేదని తాత్పర్యం.

ధూమావతీ విద్య నదిని దాటించే నావ వంటిది. చీకటి నుండి వెలుగు ఒడ్డునకు చేర్చేది. మరపు నుండి ఎరుకకు మార్గం చూపేది.

ఈ విద్యకు ఛాందోగ్యం(7)లోని భూమవిద్యకు అభేదాన్ని చూపారు గణపతి మునులు.

సూత్రం: **కేవలం సంప్రసాదేన తిష్ఠేత్ సా భూమ విద్యా**

ఈ ఉపనిషత్తులో సనత్కుమారుడు నారదునకు భూమవిద్యను ఉపదేశించాడు.

అద్వితీయ, అఖండస్వరూపంగా ఏది ఉందో అదే నిరతిశయ సుఖమనెడి భూమ స్వరూపంగా చెప్పబడింది. (తన) స్వరూపం కంటే ఇతరము లేని కేవల స్వరూపస్థితి భూమ అని చెప్పబడింది. అవిద్యచే కల్పింపబడిన ఈ ప్రపంచమంతా మరణధర్మం కలిగిందని, దానికి భిన్నమైనది భూమ అని, ఇది దేనినీ ఆశ్రయించలేదని, తనయందే తానుందని, సర్వవ్యాపకమై ఉందని, సర్వ ప్రపంచమూ దీనినే ఆధారంగా చేసికొందని, ఇదే సర్వ ప్రపంచంలోనూ వ్యాపించి యుందని, మణుల మధ్య సూత్రం గ్రుచ్చబడినట్లు సమస్త ప్రపంచంలో ఇది వ్యాపించిందని, ఈ ప్రపంచాన్ని స్వాత్మస్వరూపంగా భావించాలని, పరిశుద్ధమైన అంతఃకరణం వల్లనే అద్వితీయ అఖండానంద పరిపూర్ణ బ్రహ్మానుసంధాన రూపమైన స్మృతి కలుగుతుందని, దానినే ధ్రువాస్మృతి అంటారని, దానివల్లనే మోక్షమని ఉపదేశించాడు. అవిద్యారూప తమస్సును దాటడం వల్ల తెలియదగిన పరమార్థతత్త్వాన్ని ప్రత్యక్షమగునట్లుగా బోధించాడని చివరి మంత్రం.

**తమ సః పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః...** ప్రళయకాల యోగనిద్రయైన ధూమావతిని ఉపాసిద్దాం.

మంగళాన్ని–అమంగళాన్ని, శుద్ధాన్ని–అశుద్ధాన్ని, సురూపాన్ని–కురూపాన్ని, నిద్రను–మేల్కొన్న దశను, వెలుగును – చీకటిని ... ఇలా అన్ని జంటలను ఎవడు ప్రేమించగలడో వాడికే చిక్కుతుంది.

హ్లీం

# బగళాముఖి

**ఇక ఎనిమిదవ విద్య బగళాముఖి.**

**వాదీ మూకతి రంకతి క్షితిపతిర్వైశ్వానరః శీతతి**
**క్రోధీ శామ్యతి దుర్జనః సృజనతి క్షిప్రానుగః ఖంజతి**
**గర్వీ ఖర్వతి సర్వవిచ్చ జడతి త్వద్యంత్రణా యంత్రితః**
**శ్రీ నిత్యే బగళాముఖి ప్రతిదినం కల్యాణి తుభ్యం నమః**

ఆటంకపరిచే నీ శక్తి వల్ల వాదించేవాడు మూగగా, భూమిపతి బిచ్చగానిగా, అగ్ని శీతలంగా, క్రోధి శాంతమూర్తిగా, దుర్మార్గుడు సన్మార్గుడుగా, కదం త్రొక్కేవాడు కుంటివానిగా, గర్వి వంగినవానిగా, సర్వజ్ఞుడు అవివేకిగా మారుతున్నాడు. అట్టి నీకు నమస్కారమని ధ్యానశ్లోకం.

సభలలో సమావేశాలలో విద్వాంసునకే పట్టం కడతాం. ప్రకటించే శక్తిని బట్టి అతనికి గౌరవం దక్కుతుంది. తారోపాసకులు వాగ్విద్యా నిపుణులై ఉంటారని విన్నాం. వాదనశక్తి అవతల వ్యక్తిని మూగగా చేస్తుంది. ఈ చర్చల వల్లే అనేక సిద్ధాంతరాద్ధాంతాలు వెలుగు చూశాయి. తాత్త్విక సభలు పూర్వపక్ష సిద్ధాంతాలతో కోలాహలంగా ఉండేవి. ఒకప్పుడు ఇతరుల అభిప్రాయాన్ని మార్చి రాజ్యస్వరూపాన్నే మార్చగలిగేవి. సనాతన వాదులు, బౌద్ధ జైనుల వాగ్వివాదాలు చరిత్రపుటలలో అడుగడుగునా కన్పిస్తాయి. వీరశైవ–వీరవైష్ణవ తాండవం అంతా ఇంతా కాదు. త్రిమతాచార్యుల వాద–ప్రతివాదాలు వేదాంత గ్రంథాలలో అడుగడుగునా కనిపిస్తాయి. కొన్ని సందర్భాలలో వితండవాదాలకు దారితీసి కత్తులు దూసుకోవడం వరకూ కనిపిస్తుంది. లోకసభలలో, విధానసభలలో, న్యాయస్థానాలలో వాద–ప్రతివాద వైఖరి మనకు తెలిసిందే.

ఇక బగళాముఖి ఇతరుల యొక్క వాక్కుని స్తంభింపజేస్తుంది. వాక్ స్తంభకరీ ఒక నామం ప్రతివాది నోటిని కట్టిపారవేస్తుంది. వల్గ = (కళ్లెం)వగల అయింది. అదే బగళ అయింది. హింస–సింహమైనట్లు, పశ్యకుడు – కశ్యపుడైనట్లుగా, అనగా ఇతరుల నోళ్లకు కళ్లెం లేదా పగ్గం వేసేది. ఈమెకు బకముఖి అని కూడా పేరు. హంస నీర–క్షీరాలను వేరు చేస్తే, కొంగ మూర్ఖత్వానికి ప్రతీక. బూటకానికి మారుపేరు.

హంసను కొంగగా మార్చేది బగళాముఖి. ఆమె తంత్రాలలో ఎలా ఉందో చూద్దాం.

**జిహ్వాగ్రమాదాయ కరేణ దేవీం వామేన శత్రూన్ పరిపీడయంతీం**

**గదాభిధానేన చ దక్షిణేన పీతాంబరాఢ్యాం ద్విభుజాం నమామి**

... పచ్చనిబట్ట కట్టుకొని, రెండు చేతులు – ఎడమచేతితో ప్రతివాది యొక్క నాలుకను లాగుతూ, కుడిచేతితో గదతో వాణ్ణి మొత్తుతూ ఉంటుంది. ఆమె మంత్రం 'హ్లీం'. అంతటా పసుపు నిండిన మూర్తిగా ధ్యానించాలి. అనగా బట్టలు, ఆభరణాలు, మాలలు... అన్నీ పసుపుమయంగా ఉంటాయి. 'పీతాంబరాభరణ మాల్య విభూషితాంగి'గా ధ్యానించాలి. ఇక ఉపాసకుడు కూడా పచ్చని బట్టలు కట్టాలి. పసుపు పూసలున్న మాలతో లక్షసార్లు జపించాలి.

**పీతాంబరధరో భూత్వా పూర్వాశాభిముఖస్థితః**
**లక్షమేకం జపేన్మంత్రం హరిద్రాగ్రంథి మాలయా.**

ఈ పసుపేమిటి? ఈ రంగునకు, దేవతకు ఎట్టి సంబంధం? నిత్యసత్యాన్ని వేదం హిరణ్యవర్ణంతో ఉన్నట్లు చెప్పింది. ఆ వర్ణమే, ఆ సత్యమే భౌతిక, ప్రాణ, మనస్సులకు సంబంధించిన లోకాలుగా అవతరించిందని చదువుకున్నాం. బంగారువర్ణమే సృష్టిలో అన్నింటిని అణచివేసే పచ్చని వర్ణమై మనోరూపాన్ని చెందింది. ఈ ఆలోచించే మనస్సు సహజ జ్ఞానాన్ని, ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని అణచివేస్తుంది. బంగారు రంగు తన కాంతిని అణచుకొని పసుపుపచ్చగా మారుతుంది. ఆ పసుపురంగు మిగిలిన రంగుల్ని అణచివేస్తుంది. మిగతా రంగుల తళతళలు తగ్గించాలంటే పసుపును వాడుతారు కదా! పసుపునకు 'పీత' అని సంస్కృతంలో. అంటే త్రాగబడేది. మిగతా రంగులు దీనిచే త్రాగబడతాయి. కనుక ఆ రంగుతో బగళాముఖి ఉంటుందని, ఇతరులను స్తంభింపజేసేటపుడు ఈ రంగుతోనే ఉండాలనే మాట కుదురుతోంది కదా ! ఇతరులను స్తంభింపచేయడం కోసం త్రిపురసుందరిని శ్రీచక్రంలో పచ్చని వస్తువులతో ఆరాధించాలని పచ్చని పువ్వులతో పూజించాలని జ్ఞానార్ణవ తంత్రం –

**పీతద్రవ్యైః సమాలిఖ్య పీతపుష్పైః సమర్పయేత్**
**పూర్వాశాభిముఖో భూత్వా స్తంభయేత్ సర్వవాదినః**

ఈమెయే రాజరాజేశ్వరికి దండనాథ. అణచివేసే శక్తి. కదలని, మెదలని శక్తి ధూమావతి కాగా, కదిలే దానిని స్తంభింపచేసే శక్తి ఈమె. త్రిపురభైరవి కదలని మెదలని దశలో గూఢమైన చైతన్యం. ఇక బగళాముఖి పని ఆరంభం కాగా ముందుకు సాగకుండా చేసేది. పని ఆరంభం కాని దశకు – పని ఆరంభమైన దశకు మధ్యలో ఉంటుంది. ఎల్లపుడూ వాక్–స్తంభనే చేస్తుందని భావించవద్దు. ఆమె గర్వస్తంభన కరి మాత్రమే. మాటకు అడ్డుకట్ట వేసినా వాక్కును ప్రవహింపజేస్తుంది కూడా. వాక్ వల్లనే సృష్టి

జరిగిందని **"వాగేవ విశ్వా భువనాని జజ్ఞే"** ఉంది కనుక ఇంత విపులంగా చెబుతున్నాం.

బ్రహ్మాండగోళంలో ఈమె ఏం చేస్తుంది? చలించే వానికి అడ్డుకట్ట వేస్తే ఒత్తిడి ఎక్కువై ఇంకా వేగవంతంగా పనిచేస్తుంది. కదిలే ప్రవాహాన్ని బలవంతంగా ఆపితే దానిలోని సుళ్లు వేగం మరొక వైపుకు పోవడానికి ప్రయత్నం చేస్తాయి. బగళాముఖి ఇక్కడే పని చేస్తుంది. ఈ సూత్రం ఆధారంగానే హఠయోగ-రాజయోగాలు ప్రవర్తిల్లాయి. హఠయోగంలో ఆసనాలు, ప్రాణాయామం ఉంటుంది కదా!

ఆసనాల వల్ల శరీరం కదలికలను నియమిస్తాడు. చలన రహితంగా శరీరాన్ని ఉంచుతాడు. జడునిలా కనిపిస్తాడు. యోగి శరీరాన్ని క్రమపద్ధతిలో ఉంచడం వల్ల అతని అవయవాలు ఇంకా బలోపేతమౌతాయి. సహనశక్తి, సుందరాకారం సిద్ధిస్తుంది. శరీరశక్తి వల్ల అనేక పనులు సాధింపబడతాయి. నానారకాలుగా ఉపయోగపడే శరీరశక్తికి స్థిరత్వాన్ని చలనరహిత స్థితిని తీసికొని వస్తున్నాడు. దీనివల్ల శరీరానికి తేలిక తనం, జాడ్యం లేకపోవుట, చురుకుతనం లభిస్తాయి. రోగాలుండవు. ముసలితనం ఆమడ దూరంలో ఉంటుంది.

ఇక ప్రాణాయామం వల్ల ప్రాణశక్తి యొక్క వృద్ధి కలుగుతుంది. గాలిని పీల్చడం, వదిలిపెట్టడంతోటే సామాన్యుల జీవితం సాగుతోంది. కాని హఠయోగి ఒక పద్ధతి ద్వారా గాలిని పీల్చి, ఒక పద్ధతి ద్వారా వదిలి, ఒక క్రమపద్ధతిలో శరీరంలో బంధించి తన శరీరంలోని నాడులను శుద్ధి చేస్తాడు. ఈ ప్రాణశక్తిని సామాన్యులు నియమించరు. నాడులలో ప్రవహించేది ప్రాణశక్తియని చదివాం. రేచక, పూరక, కుంభకాల ద్వారా ప్రాణశక్తిని నియమిస్తాడు యోగి. ఇక గాలిని లోపల ప్రవేశించకుండా అరికడతాడు కూడా. దీనిని బాహ్యకుంభకమని అంటారు. ఇంతకు ముందు చెప్పింది అంతరకుంభకం. దీనివల్ల దీర్ఘజీవనం కలుగుతుంది. కొన్ని వేల యోగుల జీవితాలే ఇందుకు సాక్ష్యం.

ఇక రాజయోగంలో పైవాటికి తక్కువ ప్రాధాన్యం. మనస్సు అనేకమైన ఆలోచనల పుట్ట కదా! అసందర్భమైన అభ్యంతరకరమైన ఊహలకు నిలయం. ఈ చిత్తవృత్తులను నియమించడమే రాజయోగం. ఇది యమ-నియమాలను గురించి చెప్పింది. అసత్యం నుండి, హింస నుండి, దొంగతనం వాటి నుండి రక్షించుకోవాలని చెప్పేవే ఈ యమ నియమాలు. అహింస, సత్యం, దొంగతనం లేకపోవుట, ఇతరుల నుండి గ్రహించకపోవడం మొదలైనవి యమాలు. శౌచం, సంతోషం, తపస్సు, వేదాధ్యయనం మొదలైనవి నియమాలు. అనేక ఆలోచనల నుండి దూరంగా ఉంచి మనస్సునకు నిశ్చలత్వాన్ని, ప్రశాంతతను ప్రసాదించేది రాజయోగం.

ఇక్కడ జరిగే పని గాలిని బంధించడం, వదిలిపెట్టడం కాదు. సద్భావనలను పూరించడం(పూరకం), దుర్భావనలను త్రోసివేయడం (రేచకం), ఆలోచనల పరుగులను స్తంభింపచేయడం(కుంభకం) ఇక్కడ ఉంటుంది. అసలు ఆలోచనలే రాకుండా ముందుగానే కట్టడి చేయడం బాహ్యకుంభకం. ఆలోచనలను పూర్తిగా తుడిచివేయడమంటే లోపలికి ఆహ్వానించడంగాని, బయటకు గెంటి వేయడంగాని కాదు. ఒక విధంగా హఠయోగం కంటే రాజయోగం కష్టం. ఒక భావానికి మరొక భావానికి సంబంధం లేకుండా, వాటికొక సంతతధార లేకుండా భావప్రవాహం సాగుతుంది. ఇక అసందర్భ, అక్రమ, వ్యర్థభావాలకు అంతే లేదు. కుండలో నూనె పోసి దానికొక చిల్లు పెట్టి ఒకే ధార కన్పిస్తున్నట్లుగా ఒకే భావప్రవాహం మనలో ఎంతమందికి ఉంది? **తైల ధారవత్ అవిచ్ఛిన్నధారాప్రవాహః** – అని పంచదవలో విద్యారణ్యస్వామి అన్నట్లుగా – ఇక్కడే బగళాముఖి పనిచేస్తుంది. ఒక స్థిరాసనంలో కూర్చొని మానసిక వ్యాపారాలకు దూరుడై కుంభకాన్ని అభ్యసిస్తూ 'హ్లీం' అనే ఈ బీజాక్షరాన్ని జపిస్తే సిద్ధి కలుగుతుందని గణపతిమునులు –

**ఆసన బంధాదచలో భూత్వా రుద్ధప్రాణో బగలాం భజతే**– 'ఉమాసహస్రం'.

దీనివల్ల అణిమాదిసిద్ధులు, పంచభూతాలను అదుపులో ఉంచే శక్తి కలుగుతుంది. పడే వర్షాన్ని ఆపగలడు, నిప్పుపై నడవగలడు, నీళ్ళల్లో ఎంతసేపైనా ఉండగలడు, గాలినే ఆహారంగా స్వీకరించగలడు. ఇదంతా స్తంభన వల్లనే. ప్రకృతి యొక్క నియమాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తాడని కాదు. కాని కొంతకాలం ప్రకృతిశక్తులను అదుపులో పెట్టగలడు. దట్టంగా ఆకాశంలో మేఘాలు క్రమ్ముకొని ఉంటే వర్షం పడకుండా కొంతసేపు ఆపినా తరువాత మరింత బలంతో వర్షధారలు పడతాయి.

కొంతకాలం ప్రకృతిని స్తంభింపజేసినట్లుగా తన విధిని, లేదా గతిని, లేదా అదృష్టాన్ని ఆపగలడా? జరిగేది ఎట్లాగూ జరుగుతుంది, మన ప్రయత్నమెందుకులే అని కూర్చోవడమా ? జరుగబోయే దానిని ఆపలేకపోయినా, తన సంకల్ప బలం వల్ల రాబోయే దాని తీవ్రతను మాత్రం తగ్గించగలడు. గాలుపు యొక్క తీవ్రతను తగ్గించ లేకపోయినా ఎండ తీవ్రతను తగ్గించడానికి గొడుగు ఉపయోగపడుతోంది కదా!

పరమసత్యాన్ని చేరుకోవడానికి ఒక జన్మ పట్టవచ్చు, అనేక జన్మలు పట్టవచ్చు. ఇదంతా సాధన చేసే జీవుని పట్టి ఉంటుంది. నీ సంకల్పమే నా సంకల్పమగుగాక! అనే సమర్పణ బుద్ధి ఒంటబడితే తన శక్తిని తాను వెనుకకు మరలించగలుగుతాడు. ఒక సభలో మాట్లాడుతూ ఉండగా కొద్దిసేపు ఆగి మరల మాట్లాడే వారి శక్తిని గమనిస్తే

చాలు ఇది తెలుస్తుంది. ఇలా వెనుకకు మరల్చగలగడం, ప్రక్కకు ఒరగడాన్ని బగళాముఖి నిర్వహిస్తుంది. మాట మధ్యలో కొంతసేపు మౌనంగా ఉన్నా, బాధలలో కష్టాలలో మనస్సును మరల్చగలిగినా శక్తిని పుంజుకొంటాడు. ఆనందాన్ని అనుభవించగలడు. కేవలం పనులను స్తంభింపజేయడమే కాదు, వాక్కుని, మనస్సుని బంధింపచేయగలిగిన వారికి ఈ బగళాముఖి అనుగ్రహం లభిస్తుందని సారాంశం.

ఇది మన శరీరంలో శంఖినీ నాడి(కంఠరూపం)లో ఉంటుందని, బ్రహ్మాండంలో పితృయాన మార్గంలో ఉంటుందని సూత్రీకరించారు. ఎవరికో స్తంభన కలుగజేయడం మొదటి మెట్టు. లోనున్న కామక్రోధాదులను స్తంభింపజేయడం చివరి మెట్టు.

సూత్రం: **అంతశ్శత్రుస్తంభనకామో వా**

లోపల వాయుసంచారాన్ని అడ్డగించడమే శుద్ధోపాసనమని, ఎవడు వాయువును స్తంభింపజేస్తాడో వాడు సర్వాన్ని స్తంభింపచేయగలడనే సూత్రాలున్నాయి. శుద్ధోపాసనను ఇంద్రయోని విద్యచే చేయాలని, ఈ విద్యకు ఉపనిషత్ విద్యకు సమన్వయం చేశారు గణపతిమునులు.

సూత్రం: **ఉపజిహ్వాయామింద్రయోని విద్యా**

ఇంద్రయోని యనగా జిహ్వా మూలమందు వ్రేలాడే తైజసలింగం. అదే కొండనాలుక. అనగా దాని యందు లక్ష్యముంచి ధ్యానించడమే దాని విద్య. ఇది తైత్తిరీయ ఉపనిషత్తులో ఉంది (శిక్షావల్లి–6).

పరబ్రహ్మను ఉపాసించడానికి హృదయ పుండరీకాన్ని స్థానంగా గ్రహించాలని, అందున్న ఆకాశంలో మనోమయుడు, మరణధర్మాలు లేనివాడు, జ్యోతిస్స్వరూపుడైన పురుషుడున్నాడని... అట్టి వానిని ఉపాసించాలని ఈ మంత్రానికి ముందొక మంత్రం ఉంటుంది. ఆ పరమేశ్వరుని చేరడానికి తరువాత మంత్రం ఉద్దేశింపబడింది.

హృదయం నుండి ఊర్ధ్వంగా వ్యాపించే నాడి సుషుమ్నయని చెప్పాం కదా! అది తాలుకల మధ్య భాగాలలో ఉంటుంది. ఆ మధ్యభాగంలో ఏ మాంసపిండం స్తనం మాదిరిగా వ్రేలాడుచున్నదో దాని మధ్యభాగం నుండి మూర్ధప్రదేశాన్ని భేదించుకొని బయలు వెడలిపోవుట పరమాత్మ ప్రాప్తికి మార్గమని తరువాతి మంత్రం. రేచకం ద్వారా సుషమ్నా నాడిని శిరః కపాలము భేదించుకొని బయలు వెడలిలాగునట్లు చేయుట.

మంత్రం – "అంతరేణ తాలుకే య ఏషస్తన ఇవావలంబతే సేంద్రయోనిః"

౯౦

# మాతంగి

**తొ**మ్మిదవ మహావిద్య **మాతంగి.** వైఖరీ వాక్కుకు అధిదేవత. వాక్కు మనలో పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరులుగా ఉందని లోగడ చదువుకున్నాం. మనం ఉచ్చరించే వాక్కు వైఖరీరూపంలో ఉంటుంది. మిగిలినవి మూడూ యోగులకు విన్పిస్తాయి. ఈ అర్థం ఋగ్వేదమంత్రంలో ఉంది.

**చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః**
**గుహా త్రీణి నిహితా నేంగయంతి, తురీయం వాచో మనుష్యా వదంతి**

వాక్కే బ్రహ్మమని మంత్రం. దాని నుండే సమస్త సృష్టి. "వాగ్ వై పరమం బ్రహ్మ". వాక్కుకి నాశం లేదని, వేదమాతయని, అమృతానికి నాభియని తైత్తిరీయ బ్రాహ్మణం.

**వాగ్ అక్షరం ప్రథమమ్ యా ఋతస్య వేదానాం మాతా అమృతస్య నాభిః**

చాలామందికి తెలిసిన ఈ దిగువ మంత్రాన్ని పేర్కొంటాను –

**దేవీం వాచమజన యంత దేవాః తాం విశ్వరూపాః పశవో**
**వదంతి సానో మంద్రేషమూర్జం దుహానా ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు.**

దీనిని బట్టి అన్ని ప్రాణులు ఆ వాగ్దేవతను తమ తమ భాషారూపంగా వ్యవహరిస్తున్నారు. దేవతలు దేనిని పుట్టించారో అట్టి వాగ్దేవియైన ధేనువు(ఆవు) మా సకలమైన కోరికలను తీర్చునదై మమ్మల్ని రక్షించుగాక! అని అర్థం. అట్లే –

**వాచం దేవాఉపజీవంతి విశ్వే వాచం గంధర్వాః పశవో మనుష్యాః**
**వాచీమా విశ్వాభువనాన్యర్పితా సానోహవం జుషతామింద్ర పత్నీ**

– కృష్ణ యజు. బ్రా. 2.8.8

అనగా అన్ని ప్రాణులు తమ తమ భాషారూపమైన దానినే ఆశ్రయించి ప్రవర్తిస్తున్నారని. అట్టి వాగ్దేవి నుండి సమస్త సృష్టి జరిగినట్లు ఈ దిగువ మంత్రం –

**సా అస్మాత్ అపాక్రామత్ సా ఇమాః ప్రజాః అసృజత**

అథర్వవేదంలో ప్రత్యేకంగా వాక్సూక్తం ఉంది. ఆమె నుండే ధాత కూడా వచ్చినట్లున్నది. ద్యుపృథివీ లోకాలకు అతీతమైనదని **"పరో దివా పరా వినా పృథివ్యా"**

అని ఉండగా అది పరమ సత్యమైనదని, దానికి ఎట్టి వికారాలూ లేవని సాయణులు వ్యాఖ్యానం చేశారు. అందది సమస్త దేవతలను ధరిస్తున్నానని **అహమేవ వాత ఇవ ప్రవామి** = గాలి ఎవరి ప్రేరణ లేక చలిస్తున్నట్లుగా చలిస్తున్నానని వాగ్దేవి చెప్పినట్లుంది.

అట్టి వాక్కునకు దశాభేదాలను బట్టి ఒకొక్క దేవత అధిదేవతగా ఉంటుంది. పరావాక్కునకు 'త్రిపురభైరవి,' పశ్యంతీ వాక్కునకు 'తార' ఉన్నట్లుగానే వైఖరికి 'మాతంగి'.

**భవతి పరా వాగ్భై వ్యాఖ్యా పశ్యంతీ సా కథితా తారా**
**రసనిధిమాప్తా జిహ్వారంగం మాతంగీతి ప్రథితా సేయం** – ఉమాసహస్రం.

భూమిలో పాతిన విత్తనం కనబడదు. అది మొదటి దశ. మొలకెత్తినపుడు రెండవ దశ. చిన్న మొక్కగా మారుట మూడవదశ. మహావృక్షంగా కనబడడం నాలుగవ దశ. అలాగే విత్తనరూపంలో పరా. వృక్షరూపంలో కనబడేది వైఖరి.

ఈ వాక్కుకి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ దశలని నాలుగు. భౌతికంగా కనబడేది, పదార్థానికి సంబంధించినది స్థూలం. ప్రాణశక్తికి చెందినది సూక్ష్మం. ఈ రెండిటికి కారణ మైంది కారణం. ఈ మూడింటికి కారణమైనది మహాకారణం. స్థూలవాక్కు వైఖరి కాగా, మహాకారణ వాక్కు పరా అవుతోంది. సూక్ష్మకారణ దశలు పశ్యంతి, మధ్యమా వాక్కులు.

ఈ దశలే మనలో జాగ్రత్ దశకు (మేల్కొన్నదశ), స్వప్నదశకు (కలలు కనే దశ), సుషుప్తి దశకు (గాఢనిద్ర)... ఈ మూడింటికి అతీతమైన తురీయదశకు చెందినవి. దీనినే తాంత్రికులు మహాకారణమైన వాక్కు మూలాధారంలో ఉంటుందని, పశ్యంతీ వాక్కు నాభి యందు అనగా మణిపూరచక్రంలో ఉంటుందని, మధ్యమావాక్కు హృదయంలో అనగా అనాహతచక్రంలో ఉంటుందని, వైఖరీవాక్కు కంఠంలో అనగా విశుద్ధిచక్రంలో ఉంటుందని పేర్కొన్నారు. ఈ లోపల ఉన్న యోగచక్రాలకు, ఈ వాక్కునకు గల సంబంధాన్ని తాంత్రికులు గుర్తించారు. మానసిక–భౌతిక, మానసిక–ఆధ్యాత్మిక దృష్టిలో చూశారు.

దీనిని వైఖరియని ఎందుకన్నారు? వాక్కు కంఠంలో పరుషంగా వినబడుతుంది కనుక వైఖరి. 'విశేషేణ ఖరా' అనగా ఘనభావాన్ని పొందింది. నిశ్చయంగా చెవి రంధ్రాన్ని పొందేదని, విఖరమను ప్రాణంచే ప్రేరేపింపబడునది వైఖరియని భాస్కరరాయలవారన్నారు. పరావాక్కు భౌతిక పదార్థం యొక్క నల్లని గర్భంలో అవతరిస్తుంది. కనుకనే మాతంగి శ్యామలాకారంలో ఉంటుంది. అది చిక్కని ఆకుపచ్చ నలుపు కలిగిన రంగు – శ్యామము. చిక్కని ఆకుపచ్చను దూరంగా చూస్తే నల్లగానే ఉంటుంది. ఆమెను

'మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీ' అని శ్యామలాదండకంలో స్తుతించారు. తంత్రం ఈమెను ఇంద్రనీల –మణితో పోల్చి ఊరుకోలేదు. చాండాలి, ఉచ్ఛిష్టచాండాలి ఉన్నది.

**భారతంలో ఒక కథ :** ఒక బ్రాహ్మణ స్త్రీకి – మంగలికి పుట్టినవాడు మాతంగుడు. చండాలుడైనాడు. కాని బ్రాహ్మణత్వానికి ఎంతకాలం తపస్సు చేసినా ఇంద్రుడు ప్రత్యక్షమై కుదరదన్నాడు. కాని ఇంద్రవరం వల్ల కామరూపత్వాన్ని పొంది చండదేవుడనే ప్రశస్తిని పొందాడు. స్త్రీలచే పూజింపబడుతూ ఉండేవాడు. ఇతని కూతురే మాతంగి. 'మాతంగ కన్యాం మనసా స్మరామి' అని శ్యామలాదండకంలో ఉంది కదా! చండాలునకు పుట్టడం వల్ల చాండాలి అయింది.

ఇంతలోనే కథ అయిపోయిందా? తత్త్వాన్ని మఱుగుపఱచి కథలనందించారు. తత్త్వం అందరికీ ఒంటపట్టదు. అంతరదృష్టితో చూస్తే దీని పరమార్థం అందుతుందని శ్రీ శంకరనారాయణన్‌గారు అన్నారు. కనుకనే వేదం **"చక్షుష్మంతోను పశ్యంతి"** అన్నది. అనగా మామూలు కంటితో గాక లోనున్న నేత్రంతో, జ్ఞాననేత్రంతో చూడగలగాలి.

పేరు మాతంగి – మతంగుడంటే ? మత అనగా అభిప్రాయం. మతి యనగా మనస్సు. మతిని గూర్చి లేదా అభిప్రాయాన్ని గూర్చి వెళ్లువాడు మతంగుడు. **మతం గచ్ఛతి ఇతి మతంగః** అనగా అవ్యక్తశబ్దం వ్యక్తం కావడానికి ఆలోచించే మనస్సు దగ్గరకు వెళుతోంది. వాక్కు యొక్క ఈ దశను మతంగ అని పిలుస్తారు. వాక్కు హృదయం నుండి మనస్సు దగ్గరకు వెళ్ళునపుడు మాతంగి అవుతోంది. పరావాక్కు పరమాకాశం నుండి భౌతికదశకు చేరినపుడు ఆ శుద్ధరూపాన్ని విడిచి రంగును మార్చుకొని నల్లబడి వైఖరిగా అయింది. సంస్కృతంలో వర్ణశబ్దానికి రంగు అని, బ్రాహ్మణాది వర్ణాలని ఉంది కదా! కనుక ఆదివర్ణం (పరావాక్కు) క్రిందకు దిగినపుడు అంత్యవర్ణం(చండాల)గా – శ్యామ(నల్ల)గా మారింది. కనుక ఈమె చాండాలి అయింది. నాసికాత్ర్యంబకంలోని గోదావరి బహు స్వచ్ఛంగా ఉంటుంది. అనేక ఉపనదుల్ని కలుపుకొంటూ మహాప్రవాహంగా మారినపుడు రంగు మారడం లేదా? అలాగే ఇక్కడా.

ఉచ్ఛిష్టచాండాలి అంటే? పదాలకు అర్థాలు మారడం సహజం. ఇది శబ్దశాస్త్రంలో ఉన్నదే. ఉత్+శిష్ట = ఉచ్ఛిష్ట. అనగా మిగిలిన దానికి పైనున్నది. ఎన్ని సృష్టులు జరిగినా మిగిలే ఉన్నవాడు పరమాత్మ అని అసలు అర్థం. దురదృష్టవశాత్తు ఈ పదానికి ఎంగిలి మెతుకలని అర్థం వచ్చింది. దీని అసలు అర్థం చెప్పినవారు, శ్రీ టి.వి. కపాలశాస్త్రిగారు. వారు గొప్ప విద్వాంసులు, మహోపాసకులు.

Sri Aurobindo - Lights on the Teachings అనే గ్రంథంలో:-

"The Atharvaveda contains a short section of verses in which the abode of the supreme being from which creation proceeds is named with great significance. It is an irony that the term it employs to denote the supreme source and mainstay of all creation has come to mean in later sanskrit 'leavings of food' –ఉచ్ఛిష్ట. Obviously it is so termed because any number of creations cannot diminish the infinitude of the supreme being that for ever remains above the creation which descends from it. When the supreme force, shakti of the infinite being above deploys certain energies for the creation of the worlds, he remains still inexhaustible and rests there forming the foundation above, ఉపరిబుధ్న for the creation in its down - ward course."

ఉచ్ఛిష్ట చాండాలి ఉన్నట్లుగానే ఉచ్ఛిష్ట గణపతి కూడా ఉన్నాడు మంత్రశాస్త్రంలో. ఈ విషయమై శ్రీ శంకరనారాయణన్ గారు చర్చించారు. సూక్ష్మంగా వ్రాస్తా. బ్రహ్మణస్పతి(గణపతి)ని సామజుడని అంటారు. ఏనుగుకు హస్తి యని పేరు. అనగా హస్తం(తొండం) కలది. ఏనుగుకి సామజం అని పేరు. సామం నుండి పుట్టింది.

వాక్కు యొక్క సృష్టికర్తను వేదం బ్రహ్మణస్పతి అని పేర్కొంది. బ్రహ్మణస్పతి విషయంలో క్రియ చేయువాడు. జ్ఞప్తి, ఆలోచనాశక్తి కలిగినది ఏనుగు. ఇక మతంగ, మాతంగజ అనేవి ఏనుగుకి పర్యాయపదాలు. కనుక గణపతి– మాతంగికి వేదంలో చెప్పిన బ్రహ్మణస్పతికి పోలికలున్నాయి. వాక్కురూపంలో నున్న గణపతికి నాలుగు దశలు. పరావాక్కు రూపంలో ఉంటాడు. కనుకనే మూలాధారచక్రంలో గణపతి ఉంటాడు. కనుక పై మూడు వాక్కులకు అతీతంగా ఉత్+శిష్టుడై యుంటాడు.

బృహస్పతి ఇంద్రునకు మంత్రియైనట్లుగానే, లలిత లేక రాజరాజేశ్వరికి మాతంగి మంత్రిణి. రాణితో సమానంగా ఈమెకు అన్ని అధికారాలు, లాంఛనాలున్నాయి. కనుక ఈమెను రాజమాతంగి లేదా రాజశ్యామల అని పిలుస్తారు. ఈమెకు శ్రీవిద్యలో ప్రముఖ స్థానముంది. ఈమె ప్రధానమంత్రిణి హోదాలో ఉంది. కనుక సర్వవశంకరి. ఈమె మంత్రం 'ఐం'. వాక్కునకు అధిదేవత.

మంత్రం: "ఐం నమః ఉచ్ఛిష్ట చాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా."

వాగ్వాదిని, నకులి ఈమెకు చెందినవారే. ఆమె మూర్తులే. **'వద వద వాగ్వాదిని'** అనేది మంత్రం. మాట్లాడు మాట్లాడు అని అర్థం. వాగ్విలాసం ఈమె వల్లనే కలుగుతోంది. బగళాముఖి వాక్కుని స్తంభింపచేస్తే, ఈమె వాక్ప్రవాహాన్ని కలిగిస్తుంది. ఇక నకులి పెదవులలో, పళ్ళల్లో కప్పబడిన ఒక వాక్–గర్జనం.

**ఓష్ఠాపిధానా నకులీ దంతైః పరివృతా పవిః**
**సర్వస్యై వాచ ఈశానా చారు మామిహ వాదయేత్**

నకులి అంటే? తంత్రాలలో కులమంటే మూలాధారమని అర్థం. కు–అనగా పృధ్వీతత్త్వం. ఇందులో లీనమౌతుంది కనుక కులమని పేరు. అందున్నది కులకుండలిని. అంటే పరావాక్కు. అందుండి సహస్రారం వరకూ వెళుతుంది కదా! అదీ సుషుమ్నా నాడీ మార్గం గుండా అని చదివాం. దానినే కులమార్గమని పేరు. పరా, పశ్యంతి, మధ్యమలను దాటి వాక్కు నోటి వరకూ వచ్చినపుడు, ఉచ్చరింపబడినపుడు అప్పుడది కులం కాదు. న+కులమే=నకులమే. కనుక వైఖరీవాక్కు నకులమైంది. కనుక వ్యక్తీకరింపబడని వాక్కు కులము. వ్యక్తీకరింపబడినది నకులము.

వెన్నెముకలో సుషుమ్నా నాడి ఉంటుంది కదా! వెన్నెముకను తంత్రాలలో వీణా దండమన్నారు. మన నరాలు అందున్న తీగలు. కనుక మాతంగికి వీణ చేతిలో ఉంటుంది. అందుండే దివ్యనాదం. ఆమె సంగీతానికి తల్లిగా చెప్పబడింది. సంగీత మాతృకగా. కనుక ఆమెను ఆశ్రయించిన వానికి కలత లేదు. జీవితం మధురస్వరాలతో నిండి యుంటుంది.

మాతంగిని కీరకరా అన్నారు. అనగా చిలుకను ధరించినది. చిలుకనే ఎందుకు ధరించాలి? అన్ని పక్షులు కిలకిలారవాలు చేస్తాయి గాని, మాట్లాడలేవు. చిలకకు మాటలు నేర్పితే మాట్లాడుతుంది కదా! ఇది వైఖరీ వాక్కును సూచిస్తుంది. కపాలిశాస్త్రిగారు ఈ ఉపాసన చేసేటపుడు వారి శరీరంపై చిలుకలు వాలేవని వారి శిష్యులు ఎమ్.పి. పండిట్ గారు 'Life Beyond Life' పుస్తకంలో వ్రాశారని వారి శిష్యులు శ్రీ ఎస్. శంకరనారాయణన్‌గారు వ్రాశారు. ఆలోచించకుండా చిలుక ఎలా మాట్లాడుతుందో సాధకుడు కూడా సహజ జ్ఞానంతో మాట్లాడగలడు. ఇది సాధ్యమే. మహారచయితలలో, మహాగాయకులలో, మహావక్తలలో మాతంగీ కరుణాకటాక్షం వెల్లివిరుస్తుంది. మాతంగిని ఉపాసన చేసేటపుడు వీణానాదం వినబడేదని డా॥ ప్రసాదరాయ కులపతిగారు నాతో అన్నారు.

తన కళలో సాధన చేస్తూ మాతంగిని ఉపాసిస్తే అధిక ఫలం వస్తుంది.

ఈ విద్యకు, ఛాందోగ్యోపనిషత్తులోని ఉద్గీథవిద్యకు సమన్వయం చేశారు గణపతిమునులు.

**సూ: ప్రణవం ధ్యాయేత్ కంఠకుహరే స్థిరమనాః సోద్గీథవిద్యా**

ఉద్గీథమనగా సామవేద భాగం, ప్రణవమని అర్థం. 'ఓం' అని ఆరంభించి యాగాలలో నున్న ఉద్గాతయనెడి ఋత్విక్కు సామగానం చేస్తున్నాడని ఈ ఉపనిషత్తు ఆరంభంలో ఉంది. 'ఓం' అని ఉచ్చస్వరంతో గానం చేస్తున్నాడు కనుక ఉద్గీథమని పిలువబడింది. ఇందు ఓంకారోపాస చెప్పబడింది. అన్నింటికి పృథివి ఆధారం. నీరు పృథ్వికి కారణం. ఆ నీటి యొక్క సారం ఓషధులు, ఓషధుల సారం పురుష దేహం. ఈ శరీరంలో వాక్కు శ్రేష్ఠం. వాక్కులలో ఋక్కులు సారం.

ఋక్కు కంటె సామ శ్రేష్టం. సామగానంలో ఉద్గాతృభాగం ఓంకారంతో చేరి వినడానికి చాలా ఇంపుగా ఉంటుందని, కనుక సామగానంలో ఉద్గీథ శబ్దంచే చెప్పబడిన ఓంకారం సారతరమని చెప్పబడింది. ఇంత కంటె సారమైనది లేదు. వాక్కు అనేది ఋగ్వేదమంత్రం. ప్రాణమనేది సామవేద మంత్రం. ఋక్-సామలుగా నున్న వాక్-ప్రాణాలే ఈ విద్యలో ఉపాసింపదగిన జంట. ఈ వాక్-ప్రాణాలు ఓంకారంలో కలుస్తున్నాయి. ఇది వాక్కే కాక ప్రాణబలంతో ఉచ్చరింపదగినది కనుక ఆ రెండు ధర్మాలు ఓంకారంలో చేరియున్నాయని, ఈ ఓంకారోపాసన అన్ని కోరికలను తీరుస్తుందని ఫలం చెప్పబడింది. అలా తెలుసుకొని పరమాత్మకు ఈ అక్షరం గుర్తుగా భావించి ఉపాసించాలి.

మాండూక్యోపనిషత్తు కూడా ఓంకారాన్ని చాలా ప్రశంసించింది. అట్లే తైత్తిరీయ ఉపనిషత్తు కూడా.

'ఓం' అనే అక్షరమే పరబ్రహ్మస్వరూపమని, ఈ కనబడేదంతా ఓంకారాత్మకమేనని, ఓం అని మొదలు పెట్టే సామగానానికి ఉపక్రమిస్తున్నారని, వేదాధ్యయనం మొదట్లో దీనినే ఉచ్చరిస్తున్నారని, అంగీకారాన్ని ఇది సూచిస్తుందని తైత్తిరీయంలో ఉంది.

**ఓమితి బ్రహ్మ, ఓమితీదగ్ం సర్వం .....**

**ఓమితి సామాని గాయంతి** మొదలుగా మంత్రాలున్నాయి.

స్తోత్రాలు చేయడం వల్ల మాతంగి అనుగ్రహిస్తుందని ఉమాసహస్రంలో – **మాతంగీం తాం గుణగానేన** – 10 శ.2వ స్తబకం.

శ్రీం

# కమలాత్మిక

**కమలాత్మిక** లేక **కమల** దశమహావిద్యలలో చివరిది. త్రిపురసుందరికి, ఈమెకు దగ్గర పోలిక ఉంది. అయితే ప్రత్యేకంగా ఎందుకు చెప్పాలి? తత్త్వాలలో ఈ రెండు విద్యలకు ఐక్యం ఉన్నా, అధిదేవతలు తేడాగా ఉండుటచే చెప్పవలసి వచ్చింది. సుందరీ దేవతలో దేవత మధ్యముని భార్య. ఇక్కడ దేవత ఉత్తముని భార్య. ఉత్తముడేమిటి? మధ్యముడేమిటి? భువనాలకు ఆవల కేవలంగా ఉండే శక్తీశ్వరులను ఉత్తములని, భువన కారణత్వాన్ని వహించి భువనాధిష్ఠులైతే మధ్యములని వ్యవహారం.

సహస్రారంలో సుందరి ఉండగా, ఈమె హృదయంలో ఉంటుంది కనుక ఈ భేదం వచ్చింది.

ఈమె కూడా శ్రీవిద్యకు సంబంధించినదే. 'శ్రీం' అనే ఒకే అక్షరం మంత్రం ఈమెకు. మోక్షకాముడు, వైభవాన్ని కోరేవాడు ఉపాసించాలని దశసూత్రావళిలో ఉంది. సుందరి మంత్రంలో 'శ్రీం' ఉంది. ఇక్కడా ఉంది.

కొన్ని పురాణాలలో శివ–విష్ణువుల కలహం వర్ణింపబడింది. ఇది నిజంగా కలహమా? జాగరూకతతో గమనిస్తే ఒకదానికి మరొక దానికి సంబంధం ఉండడమే కాదు, రెండూ ఒకటేనని చెప్పగలుగుతాం. హర, హరి శబ్దాలకు ధాతువొకటే. అది 'హృ'.

రుద్రునిలోని భయంకరత్వంలో లోకకల్యాణం దాగి ఉంది. స్థితికారకుడైన విష్ణువూ నృసింహావతారం ఎత్తినపుడు అతడూ భయంకరుడుగానే ఉన్నాడు. తీవ్రంగా యుద్ధం చేసే మరుత్తులకు తండ్రిగా రుద్రుడు వేదంలో నుతింపబడ్డాడు. ఋగ్వేదం అయిదవ మండలంలో చివరి సూక్తంలో విష్ణువును 'ఏవయా మరుత్' అని కీర్తించింది. మరుత్తులకు ఇతడు మూలకారకుడని అర్థం. ఇలా అభేదము ఉంది.

రుద్రుడు శివకామేశ్వరుడు. ప్రేమాధిదేవత. సుందరి అతని కామకళ. ఆ కామకళయే ప్రేమకు మూలం. సృష్టికర్తను సృష్టిని బంధించునది అదే. పెల్లుబికే ఆనందానికి, అందానికి, విమలజ్ఞానానికి, సర్వవస్తువులలో ఉన్న రసానికి అధిదేవత. కామేశ్వరుని శక్తి, కామకల, కామేశ్వరి, సుందరి. సత్–చిత్–ఆనందాలనే మూడింటిలో అన్నం–ప్రాణం–మనస్సులలో ఇలా మూడు మూడుగా ఉన్న అన్నింటిలో ఉన్న అవ్యయసౌందర్యమే ఆమె. ఈ మూడు...

మూడుగా చేసేదెవరు? అన్నింటా వ్యాపించిన విష్ణువే. మూడు మూడుగా నున్న అన్నింటిలో పాదాన్ని మోపినవాడు విష్ణువే.

**ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధేపదం**– ఋక్. 1.22. 17

అనంతాకాశంలో ఈ భువనాలను ఉంచినవాడు. రుద్రతీవ్రతకు విష్ణువు ఆకాశమనే రంగస్థలాన్ని అందిస్తున్నాడు. శివుని శక్తి, త్రిపురసుందరి భువనాలలో సుందరరూపంలో ఉండి తీర్చి దిద్దుతోంది. ఇక్కడ విష్ణువు యొక్క శక్తి. కమల – ఆ సౌందర్యాన్ని వెలికి తీస్తోంది. ఏ వస్తువునందైనా ఉన్న ఆనంద సౌందర్యాలను పైకి వెల్లడియగునట్లుగా చేస్తుంది.

అన్నింటా దాగిన చైతన్యం, అందం సుందరిదే. దానిని వెలుగులోకి తీసికొని వచ్చేది కమల. బగళ అన్నింటిని స్తంభింపచేస్తే, కమల అన్నింటికీ గతిని కల్పిస్తుంది. వ్యక్తీకరింపబడేటట్లు చేస్తుంది. విష్ణువు భార్య లక్ష్మియే ఈమె. లక్ష్మియనగా లక్ష్మ కలది. అనగా గుర్తు. ఒక వస్తువు మరొక వస్తువు నుండి విలక్షణంగా ఉండడానికి ఈ గుర్తు కావాలి. ఎంత ఆకర్షించే వస్తువైనా ఈమె కళ అందులో లేకపోతే ఆ వస్తువు వెలవెలపోతుంది.

కమల పదానికి అర్థం ఏమిటి? 'క' అనగా శిరస్సు, జలం, శిఖరం అనే అర్థాలున్నాయి. 'మల'–మళ్ళా ధారణే. అనగా ధరించేది. అనగా కమల నీళ్లను వస్త్రంగా ధరిస్తోంది. సుందరాంగులు వస్త్రాలను ధరించారట. అవి ఎంత సన్నగా ఉన్నాయంటే నీళ్లనే బట్టలుగా ధరించారా అన్నట్లుగా ఉన్నారని అమిర్ ఖుస్రో అంటాడు.

**అపో వసానా** అని మంత్రంలో ఉంది కదా! ఈ నీళ్లేమిటి? నీళ్ళకు సంస్కృతంలో **అపః** అని పేరు. గతిని సూచిస్తుంది ఆ పదం. సృష్టిలో గతిశక్తి జీవనశక్తి. ఈ నీరు దివ్యమైనది. అనగా దైవ సంబంధమైనది – **"ఆపో దైవీః".** క= శిరస్సు నుండి, శిఖరం నుండి జాలువారుతుంది. అనగా ఎత్తైన ప్రదేశాల నుండి అని కదా! అనగా దివ్యలోకాల నుండి జాలువారుతోంది. ఆ దివ్యమైన నీరే, గమనశీలమైన నీరే సృష్టికి కారణం. పురాణాలు ఆమె నీటిలోంచి వచ్చినట్లు అనగా క్షీరసముద్రం నుండి పుట్టినట్లు వర్ణించాయి. అది మామూలు సముద్రం కాదు. ఆమె క్షీరసాగరకన్యకా. అది అమృత సముద్రం. అది అమృతత్వానికి, వ్యాపకత్వానికి, అనంతత్వానికి గుర్తు. అందుండి వచ్చేవి **"మధుమాన్ ఊర్మిః"** అనగా మధుమయ తరంగాలు వస్తున్నాయని ఋషి గానం చేశాడు. ఆమె

ఇందిర. ఇందు – చంద్రుని యొక్క సోదరి. సంతోషానికి గుర్తు చంద్రుడు. అందరిలో ఉన్న సంతోషమూ ఆ క్షీరసాగరం నుండే. అనంతవిష్ణువును రమింపచేసేది, సంతోషపెట్టేది కనుక రమ. శ్రీ – సంపద కూడా.

వేదభాష గూఢంగా ఉంటుంది. ఋషులు సహజజ్ఞానంతో తత్త్వాన్ని దర్శించారు. వారి భాష సంకేతాలతో ఉంటుంది. ఆమె నీరే బట్టగా కలిగిందంటే ముందుగా అర్థం కావడం కష్టం. ఆలోచిస్తే చిక్కు విడుతుంది. 'అప్' అనే ధాతువుకు 'సృజించు' అని అర్థం. 'అంబ్' కూడా అట్టిదే. సంస్కృత పదాలు చూడండి. అంబ–అంబక, అంబి–అంబిక అనే పదాలకు ఆపః అపః అంబు, అంభః – పదాలకు పోలికను గమనించండి.

నీటి నుండి పద్మం పుట్టడం గురించి చెబుతా. పద్మం ఒక సృజనాత్మక శక్తికి(క్రియేటివ్ పవర్) సంకేతం. ఈ పద్మమూ నీటిచే ఆవరింపబడి ఉంటుంది కదా! నీటి నుండి పుట్టింది కనుక దీనికి అంబుజ, అంభోజ, జలజ మొదలైనవి నామాలున్నాయి. సూర్యోదయంతో వికసించి అస్తమయంతో ముకుళించుకొని పోతుంది. జీవనదాతయైన సూర్యునికీ, దీనికీ సంబంధం ఉంది. ఈ శతపత్రం వికసించడమంటే చైతన్య వికాసమే. కనుకనే ప్రతి కళలోనూ పద్మప్రస్తావన ఉంటుంది. అంతేకాదు, యోగంలో, వేదాంతంలో దీని ప్రస్తావన అడుగడుగునా కన్పిస్తుంది. బ్రహ్మను పద్మసంభవుడని అన్నారు. అనగా పద్మం నుండి పుట్టినవాడని. విష్ణువు సృష్టించడానికి ముందుగా అనంతునిపై శయనించి ఉంటాడని, అతని నాభి నుండి పద్మం పుట్టిందని అతడు కమలనాభుడనే మాట ఉంది కదా! అతడు కమలాక్షుడు కూడా. జగన్నిర్మాణాన్ని వీక్షించేవాడు. ఇక సద్ అనే మాటకు కూర్చుండు అని అర్థం. దాని నుండే సదన, సద్మపదాలు. అట్లే పద్ అనగా పాదం. దాని నుండి పద్మం. అతని పాదముంచే స్థలం కనుక పద్మమైనది. పద్మాకారంలో ఉండే ఆసనానికి పద్మాసనమని పేరు. శరీరంలోని యోగచక్రాలు పద్మాకారంలోనే ఉంటాయి.

ఇలా అడుగడుగునా కనిపించే పద్మానికి, కమలాత్మికకు దగ్గర సంబంధం. ఆమె పద్మాసనంపై కూర్చొని రెండు చేతులతో పద్మాలను పట్టుకొని ఉంటుంది. మిగిలిన రెండు చేతులు వరద–అభయముద్రలతో ఉంటాయి. బంగారు వర్ణంతో ఉండి, తెల్లని పట్టుచీరతో ఉంటుంది.

నిరంతరం, పర్వతాకారంలో ఉండే నాలుగు ఏనుగులు తమ తొండాలతో ఆమెపై అమృతోదకాన్ని క్రుమ్మరిస్తూ ఉంటాయి.

**కాంత్యా కాంచనసన్నిభాం హిమగిరిప్రఖ్యైః చతుర్భిర్గజైః**
**హస్తోక్షిప్త హిరణ్మయామృత ఘటైరాసిచ్యమానాం శ్రియం**
**బిభ్రాణా వరమబ్జయుగ్మమభయం హస్తైః కిరీటోజ్జ్వలాం**
**క్షౌమాబద్ధనితంబబింబలలితాం వందేఽ రవిందస్థితాం**

కనుక వేదంలో చెప్పిన దానికి దీనికి పోలిక ఉంది కదా! ఆ ఏనుగులు సూక్ష్మమతికి, వివేకానికి, మానసికమైన కదలికలకు, భౌతికప్రపంచంలోని సృజనాత్మక శక్తికి సంకేతాలు.

ఈమె మంత్రం 'శ్రీం'. శ్రీసూక్తంలో పదిహేను ఋక్కులలో ఈమె వర్ణింపబడింది. పదిహేను ఋక్కులు 'పంచదశి'లోని పదిహేను అక్షరాలే !

కమల ధూమావతికి విరుద్ధంగా ఉంటుంది. ధూమావతి సృష్టి లేదన్నట్లుగా ఉండే దశ. ఈమె సృష్టి వికసించిన తరువాత ఉన్న దశ. ఆమె జ్యేష్ఠ. ఈమె లక్ష్మి. సృష్టిలోని సమతౌల్యాన్ని(బ్యాలన్స్) అందాన్ని లోపల-బయట చూడదలుచుకొనేవారు ఈమెను ఉపాసించాలి. ఈమె సాధకుని ఐహిక-ఆముష్మిక దారిద్ర్యాన్ని పోగొడుతుంది. అన్ని దశమహావిద్యలలో ఈమె సాధకుని ఆకర్షించినట్లుగా ఏ విద్యా ఆకర్షించదు.

ఇంద్రియజ్ఞానం లేని భౌతిక సౌందర్యంలో పరమేశ్వరుని దివ్యానందం ప్రతిబింబిస్తోంది. ఆ పరమానందం యొక్క చిరునవ్వు అన్నింటా దాగి ఉంది. గాలి ఊపిరిలో, చెట్టుకు ఎక్కే రసంలో (వృక్షాదుల సారం), హరిత పత్రాలలో, పువ్వులలో ఆ దివ్యకాంతి వికసిస్తోందని సెలవిచ్చారు యోగి అరవిందులు.

"The World senseless beauty mirrors God's delight
that rapture's smile is secret everywhere
If flows in the wind's breath, in the tree's sap
Its shed magnificance blooms in leaves and flower's" - 'Savitri'.

ఈ విద్యకు, బృహదారణ్యక ఉపనిషత్తులో(2.5) మధువిద్యకు సమన్వయాన్ని సాధించారు గణపతిమునులు.

అధర్వుని కొడుకైన దధ్యఙ్ మహర్షి – అశ్వినీదేవతలకు మధువిద్యకు సంబంధించిన కథ. ఎవరికైనా మధువిద్య చెప్తే తల పగలకొడతానని ఇంద్రుడన్నాడని అశ్వినీ దేవతలతో మహర్షి అన్నాడు. నా ప్రాణం పోతుంది కదా! అంటే "మేం ప్రాణదాతలం... ముందు

నీ శిరస్సు ఛేదించి మరొకచోట పెట్టి భద్రపరుస్తాం" అని చెప్పి గుర్రపుతల అతికించారు. ఇతడు ఉపదేశింపగా ఇంద్రుడు వచ్చి మహర్షి యొక్క తల నరికాడు. తరువాత నిజ శిరస్సును దేవతలు అతికారు.

తేనెతుట్ట అనేకమైన తేనెటీగలచే నానా పుష్పాల నుండి మకరందం తీసికొని రాబడి నిర్మింపబడుతుంది. ఇలా భూమి మీద నివసించే ప్రాణులచే వారి వారి కర్మలకు భోగ్యంగా ఈ భూమి నిర్మింపబడింది. భూమికి అన్ని ప్రాణులు అనుభవింపదగినవారుగా- తేనెగా ఉన్నారు. దీని వల్ల ఒకరికొకరు ఉపయోగపడుతున్నారు. ఈ భూమి యందు అమరుడైన ఏ పురుషుడున్నాడో, అలానే మన శరీరంలో అమృతమయుడైన ఏ పురుషుడున్నాడో, అతడు కూడా సర్వభూతాలకు ఉపకారం కలిగించడం వల్ల మధువైయున్నాడు. అట్లే ఈ పురుషునకు ఈ భూతాలు కూడా మధువుగా ఉన్నాయని వేదం చెప్తోంది. **"ఇయం పృథివీ సర్వేషాం..."** ఆదిగా గల మంత్రం.

పృథివికి సర్వభూతాలూ మధువు. ఆ పృథ్వి సర్వభూతాలకు మధువు. ఆ రీతిగానే నీరు, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, చంద్రుడూ, విద్యుత్తు – పర్జన్యుడు, ఆకాశం మధువుగా గ్రహించాలి. ఈ మానవులందరూ పరస్పరం ఒకరినొకరు ఉపకారం చేసుకుంటూ నడుచుకొంటున్నారు. కాబట్టి మనుష్యజాతి సర్వభూతాలకూ మధువైంది.

అందరిలోనూ ఒకే ఆత్మ ఉందని తెలిసిన బ్రహ్మజ్ఞానిలో సమస్త జగత్తు బండి చక్రం యొక్క నాభికుండంలో నేమి మాదిరిగా, బండిచక్రపు ఆకుల మాదిరిగా సర్వభూతాలు, అనగా అన్ని ప్రాణులు, సర్వదేవతలు, సర్వలోకాలు ఇతని యందు కూడియున్నారనే తత్త్వబోధ ఇందులో ఉంటుంది. కేవలం ఆత్మవిద్య చేతనే అమృతత్వం సాధింపబడుతుందని తాత్పర్యం. ఈ పరమేశ్వరునిచే లోపల ప్రవేశింపబడని వస్తువే లేదు. ఈ పరమాత్మ చేత వెలుపల నుండి వ్యాపింపబడని వస్తువే లేదు. అనగా అతడన్నిటా వ్యాపించియున్నాడని సారాంశం. ఆయన శరీర, ఇంద్రియ రూపాన్ని ధరించి యున్నాడని బోధిస్తోంది. అలాగే కమలాత్మిక. అన్నిటా ఉండే ఆ మాధుర్యమే, మధువే కమలాత్మిక.

# దశమహావిద్యలు – పదిదిక్కులలో



# సమన్వయం

**ఈ** దశామహావిద్యలలో ఒకొక్క దానికి ఒకొక్క ప్రత్యేకత ఉంది. ఒకొక్క పనిని ఈ విశ్వంలో నిర్వహిస్తున్నాయి. నేటి సైన్సు ప్రకారం ఈ జగత్తు ఆకర్షణశక్తి, విద్యుదయస్కాంత శక్తి(ఎలక్ట్రో మాగ్నటిక్ ఫోర్స్) మొదలైన శక్తుల ద్వారా నిలబడిందని చెప్పినట్లుగా 'ధూమావతి' అసత్‌నకు అధిష్ఠాత్రి. సృష్టి మొదలైనపుడు 'కాళి' కాలమవుతోంది. 'భువనేశ్వరి' ఆకాశమౌతోంది. అవ్యక్తమైన వాక్కు యొక్క దశలో 'త్రిపురభైరవి' పని చేస్తోంది. పశ్యంతీ వాగ్రూపంలో 'తార', వాక్కు యొక్క వైఖరీదశలో 'మాతంగి' రాజ్యమేలుతున్నారు. ఆదిమమైన, తేజోమయమైన కోరికగా 'త్రిపురసుందరి' భాసిస్తోంది. ఆహ్లాదకరమైన సౌందర్యమే 'కమలాత్మిక'. 'ఛిన్నమస్త' తీవ్రనాద కాంతుల సమ్మేళనం. 'బగళాముఖి' స్తంభనశక్తిగా విరాజిల్లింది. కనుక పరమసత్యం యొక్క విభూతులు పది మహావిద్యలలో గోచరిస్తున్నాయి. జగత్తును నిలుపుతున్నాయి.

తాంత్రిక దేవతలు ఒక్కమాటుగా ఊడిపడినవారు కారు. వీటికి మూలం వేదమే అని ఉపోద్ఘాతంలో వ్రాశాను. సహజ జ్ఞానంతో, అతీంద్రియ జ్ఞానంతో గూఢంగా చెప్పబడిన మంత్రాలను దర్శించారు మహర్షులు, తంత్రాల ప్రతిబింబాలు వేదాలలో ఉండవు. వేదభావాల ప్రతిబింబాలే తంత్రాలలో ఉంటాయి. ఇందు చెప్పబడిన రూపాలు, కథలూ యథాతథంగా అందులో స్పష్టంగా కనబడవు. ధూమావతి, ఛిన్నమస్త వంటి పేర్లు అందుండవు. కాని ఋషుల భావాలు ఇందు తొంగి చూస్తుంటాయి. కష్టాల నుండి గట్టెక్కించేటట్లుండే అగ్ని, ఇవతల ఒడ్డు నుండి అవతలి ఒడ్డుకు చేర్చే దుర్గగా ఇందు సాక్షాత్కరిస్తుంది. చీకటి గర్భంలో దాగిన చీకటియనే భావం ధూమావతిలో గోచరిస్తుంది. పరమేశ్వరుని కామకళ త్రిపురసుందరిగా ఇక్కడ కన్పిస్తుంది. ఖండింపబడనిది అనే అర్థం ఇచ్చే వేదంలోని అదితి ఇక్కడ భువనేశ్వరి. జాజ్వల్యమానమైన అగ్ని ఇక్కడ త్రిపురభైరవి. కనుక సృష్టికి కావలసిన ఆకాశం, కాలం, వేడి మొదలైన వాటికి పైవి ప్రతీకలు. కనుక వేదంలోని దేవతలే ఇక్కడ అవే పేర్లతో పిలువబడరు. కాని ఈ తాంత్రిక దేవతలకు వేదమే మూలం. కొన్ని తాంత్రిక ఉపాసనలలో వేదమంత్రాలను ఉచ్చరిస్తారు. "ఆమెకు మృత్యువు లేదు. ఊర్ధ్వ అధోభాగాలను నింపుతోంది. కాంతితో చీకట్లను మళ్లిస్తోంది" అని అర్థమిచ్చే ఋగ్వేద మంత్రాన్ని కాళీపూజలో వాడతారు.

**ఓర్వ్రపా అమర్త్యా నివతో దేవ్యుద్వతః, జ్యోతిషా వాధతే తమః** (10-127-2)

వృషాకపి దర్శించిన ఇంద్రాణి మంత్రాన్ని ఛిన్నమస్తకు వాడతారు. "సంహోత్రం స్మపురా ..." ఆదిగా గల మంత్రం. రాత్రి దేవతను రాత్రి యందే పూజించాలని వేదమార్గం వారు అనగా, ఇందు కాళిని రాత్రి పూజిస్తారు.

పోనీ ఈ విద్యలన్నీ ఉపనిషత్తులలో చెప్పబడ్డాయా? చాలామంది భావించినట్లుగా ఉపనిషత్తులు కేవల జ్ఞానాన్నే చెప్పవు. అనేక సాధనలున్నాయి. ఆ సాధనా పద్ధతులను తాము ఆచరణలో పెట్టి వివరించి చెప్పేవారు లేరు. ఉపనిషత్ విద్యల గురించి బ్రహ్మ సూత్రాలలో ఉంది. ఆ పైన తంత్రాలలో వివరింపబడినంత సమగ్ర పద్ధతిలో ఉపనిషత్తులలో వివరింపబడలేదు కూడా. ఆ విద్యను దర్శించిన ఋషి పేరు, దాని ముఖ్య భావం, కొన్ని సూచనలు మాత్రమే ఉంటాయి. వాసిష్ఠ గణపతి మునులు మాత్రం ఈ తాంత్రిక విద్యల యొక్క మూలం ఉపనిషత్తులలో ఉందని మొట్టమొదట చెప్పిన మహామనీషి. వారి సూత్రాలను అందించా. ప్రతి విద్య చివర వారి సమన్వయాన్ని మీ ముందు ఉంచా.

ఇక పురాణాలకు, వీటికి ఏమైనా సంబంధం ఉందా? అవి దేవ, దేవతల కథలలో నిండి ఉంటాయి. దుష్టశిక్షణకు శిష్టరక్షణకు పరమేశ్వరుడు అవతరిస్తాడని మనం నమ్ముతాం. సృష్టి స్థితి లయకారులుగా వారు అవతరించినట్లు మనం వింటున్నదే. ప్రతి అవతారంలోనూ ఒక శక్తి ఉంటుంది. ఆ అవతార కార్యం ఆమె నిర్వహిస్తూ ఉంటుంది. విష్ణువు యొక్క దశావతారాలకు – ఈ దశమహావిద్యలకూ ఏమైనా సంబంధం ఉందా? అని శంక.

పరశురామావతారంలో అతని తల్లి రేణుకయే శక్తి. కృష్ణుడు – కాళి శాక్తశక్తులుగా ఉంటారు. కృష్ణునకు 'క్లీం' మంత్రమైతే కాళిమంత్రం 'క్రీం'. ర, ల... లకు భేదం లేదు కదా! కాళి యొక్క అవతారాన్ని విని కృష్ణుడవతరించినట్లుగా కంసుడు భ్రాంతి పడ్డాడని భాగవతం అంటోంది. ఆ పిల్లను చంపడానికి ప్రయత్నించిన కథ మనకు తెలిసిందే. వీటిని ఆధారంగా చేసికొని అవతారాలకు, ఈ విద్యలకు సమన్వయాన్ని ప్రతిపాదించింది ముండమాలాతంత్రం.

కృష్ణుని శక్తియే కాళి. నీ పురుష రూపమే గోపీకాస్త్రీలను మోహింపచేస్తోందని అమ్మవారన్నట్లు లలితోపాఖ్యాన బ్రహ్మాండపురాణాలలో ఉంది. ఇద్దరూ నల్లగా ఉంటారు.

కురుక్షేత్రాన్ని కార్యక్షేత్రంగా చేసుకొని కృష్ణుడాడించిన నాటకం మనకు తెలుసు. రాముని వెనుక తార ఉంది. రామనామమే తారకమంత్రం కదా! అరణ్యాలు దాటి, కొండలను గుట్టలను దాటి చివరకు సముద్రాన్ని దాటినవాడు కదా! పశుపక్ష్యాదులను తరింపచేశాడు. అందరికీ చీకటి నుండి వెలుగును ప్రసాదించిన అవతారమూర్తి కదా!

వరాహావతారంలో ఇతని శక్తి భువనేశ్వరి. భూమిని త్రవ్వినవాడు వరాహావతారమూర్తి. భూమిని అక్రమించింది, ఆకాశానికి అధిష్టాత్రి భువనేశ్వరియే కదా!

నృసింహావతారంలో త్రిపురభైరవి అతని శక్తి. ఆ అగ్ని తేజస్సు దుష్టులకు మాత్రమే భయంకరంగా ఉండి సాధకులకు చల్లని తల్లిలా ఉంటుంది. హిరణ్యకశిపుని పట్ల, ప్రహ్లాదుని పట్ల ఆ అవతారం ఎలా ప్రవర్తించిందో ఈమె కూడా అంతే. వామనావతారంలో ఇతని శక్తి ధూమావతి. మూడు అడుగులలో మూడు భువనాలను ఆక్రమించాడు. కదా! వామనరూపంలో అతడు పొట్టిగా ఉండగా అతని శక్తి అసద్రూపంలో ఉంటుంది. పరశురామావతారంలో ఆమె అతని తల్లియే రేణుక అతని శక్తి. రేణుకను ఖండించినవాడు కొడుకైన పరశురాముడు. ఛిన్నమస్త కూడా ఖండింపబడిన శిరస్సుతో ఉంటుంది. కదా!

నీళ్లచే నిరంతరం తడుపబడే కమలాత్మికకు, నీళ్లల్లో ఉండే మత్స్యావతారానికి సంబంధం ఉంది. మొదటి అవతారమే మత్స్యం కదా! అన్ని అవయవాలు ముడుచుకొని కూర్చుండే కూర్మావతారానికి స్తంభన శక్తియైన బగళాముఖికి సంబంధం. అతని శక్తిగా ఉండడానికి సర్వవిధాల తగినట్లుంది. వైఖరీ వాక్కునకు అధిష్టాత్రియైన మాతంగి బుద్ధావతారంలోని శక్తి. వైఖరీ వాక్కుతోనే లోక వ్యవహారం జరుగుతోంది కదా! బుద్ధుడు సత్యాన్ని ప్రజల భాషలో అందించినవాడే(పురాణ బుద్ధుణ్ణి దూరంగా ఉంచితే). రాబోయే కల్కి అవతారంలో అతని శక్తి త్రిపురసుందరి. ఆమె షోడశకళా ప్రపూర్ణతో అవతరిస్తుందని ముండమాలాతంత్రం–

**కృష్ణస్తు కాలికా సాక్షాత్ రామమూర్తిశ్చ తారిణీ**
**వరాహో భువనాప్రోక్తా నృసింహో భైరవీశ్వరీ**
**ధూమావతీ వామనః స్యాత్ ఛిన్నా భృగుకులోద్భవః**
**కమలా మత్స్యరూపఃస్యాత్ కూర్మస్తు బగళాముఖీ**
**మాతంగీ బౌద్ధ ఇత్యేషా షోడశీ కల్కిరూపిణీ**

# సాధన

**తం**త్రాల గురించి, అందుండే సాధన గురించి కులార్ణవ తంత్రానువాదంలో, 'మన దేవతలు–శక్తి' పుస్తకంలో విపులంగా వ్రాశాను. కొన్నింటిని మాత్రమే పేర్కొంటా.

కేవలం మోక్షం గురించి తంత్రం ప్రవచించదు. ఈ జీవితాన్ని మిథ్యగా భావించదు. భోగకాంక్షియైన సాధకుణ్ణి ఈసడించదు. భుక్తిని కలిగిస్తూ, ముక్తిని ప్రసాదించేది. ఏవి పతనానికి కారణమౌతాయో వాటినే ఆధారంగా తీసికొని సాధన చేయాలంటుంది. నేలమీద పడ్డవాడు నేలనే ఆసరాగా తీసికొని లేచినట్లుగా ఏ మధు మాంసాదులు సాధకుణ్ణి అధోగతిని కల్గిస్తాయో వాటినే తగు విధంగా స్వీకరించి దేవికి నివేదించి దివ్యానందాన్ని పొందాలంటుంది. మరొకటి ఇది అధికారి భేదాన్ని గుర్తించింది. అందరికీ ఒకే పద్ధతిలో సాధన ఉండదు. పశు, వీర, దివ్య సాధకులను గుర్తించింది. తామసిక దశ నుండి రాజసికదశకు, అందుండి సాత్త్వికదశకూ సాధకుణ్ణి చేర్చడమే దీని లక్ష్యం.

ఇది రెండు మార్గాలను చూపించింది – ప్రధానంగా అదే వామమార్గమని, దక్షిణమార్గమని. ఒకటి ఆనందానికి దారి చూపితే, రెండవది జ్ఞానానికి దారి చూపిస్తుంది. ఇందేది ఉత్తమమని నిర్ణయించడం కష్టం. మా మార్గం గొప్పదంటే మా మార్గం గొప్పదని భావించేవారున్నారు. వామమార్గంలో మధువు, మత్స్యం, మాంసం, ముద్ర, మైథునం ఉంటాయి. వామ మార్గంలోని అంతరార్థాన్ని భావించకుండా భ్రష్టులైనవారు చాలామంది. కనుకనే ఆదిశంకరులు దక్షిణమార్గాన్ని బహుళప్రచారంలోకి తీసికొని వచ్చారు. వామమార్గం కత్తిమీద సాము వంటిది. పెద్దపులిపై స్వారీ చేయడం వంటిది. ఏ మాత్రం పొరపాటు జరిగినా సాధకుణ్ణి అధోగతిలోకి తీసికొని పోతుంది. సరిగ్గా ఆచరిస్తే ఆ మార్గమే దివ్యానందాన్ని ప్రసాదిస్తుంది.

మాయలోనున్న మూడు గుణాలలో రజస్సు, తమస్సు అధికంగా ఉంటే అది అవిద్యయని, కేవల సత్త్వగుణంతో ఉండేది విద్యయని, అదే ఆనందఘనమైతే మహావిద్య. అదే తురీయం, అదే సచ్చిదానందరూపిణి యని అంటారు.

ఈ దశమహావిద్యలను రెండు కుటుంబాలుగా విభజించారు. కాళీకులం, శ్రీకులం. కాళి, తార, రక్తకాలి, భువన, మర్దిని, త్రిపుట, త్వరిత, దుర్గ, విద్యా ప్రత్యంగిర – ఇవి కాళీకులానికి చెందాయి. ఇక సుందరి, భైరవి, బాల, బగళ, కమల, ధూమావతి, మాతంగి, విద్య, స్వప్నావతి, మహావిద్యా మధుమతి– ఇవి శ్రీకులానికి చెందాయి.

సిద్ధవిద్యలలో దక్షిణ నాకు ప్రీతికరమని దేవి చెప్పినట్లు నిరుత్తరతంత్రం చెప్పింది. దివ్య వీరసాధకులకు, జ్ఞానులకు కాళీకులమని; కర్మమార్గంలో ఉన్నవారికి, దివ్యవీర పశుభావాలతో ఉన్నవారికి శ్రీకులమని తంత్రాలంటున్నాయి.

సాధకులలో శాక్తేయుదుత్తముడని, అందు కాళీ సాధకుదుత్తముడని 'నిగమకల్పతరు' వచనం. కాళికోపాసనను మహా మహా బ్రహ్మవిద్యగా యోగినీతంత్రం చెప్పింది. ఏడు లక్షల మహావిద్యలు గుప్తంగా ఉన్నాయని, అందు షోడశి గొప్పదని, ఆ షోడశికి కూడా కాళి తల్లియని కామాఖ్యతంత్రంలో ఉంది. దక్షిణకాళి సర్వవిద్యా స్వరూపిణియని నిరుత్తర తంత్రం. అన్ని రంగులూ నలుపులో కలిసిపోతున్నాయి. కనుక అన్ని భూతాలూ కాలికలో కలిసిపోతున్నాయని మహానిర్వాణ తంత్రవచనం.

తార సత్త్వగుణంతో ఉంటుందని, తత్త్వవిద్యను ప్రసాదిస్తుందని, త్రిపురసుందరి, భువనేశ్వరి, ఛిన్నమస్త రజోగుణంతో, సత్త్వగుణంతో ఉంటాయని కనుక అప్రధానమైన స్వర్గాన్నిస్తాయని, ఐశ్వర్యాన్నిస్తాయని, ధూమావతి, బగళ, మాతంగి, కమలలు తమః ప్రధానంగా ఉంటాయని – వీటితో షట్కర్మలు(ఇతరులను వశం చేసుకొనుట, చంపుట మొదలైన కర్మలు) భక్తులు చేస్తారని కామధేను తంత్రం అంటోంది. అన్ని విద్యలూ మోక్షాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రసాదిస్తాయి.

కాళి, తారలు మహావిద్యలు. షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమావతి విద్యలని, బగళ, మాతంగి, కమలలు సిద్ధవిద్యలని ఒక తంత్రంలో ఉంది. శ్యామా రహస్యం పది శక్తులు మహావిద్యలని పేర్కొంది.

**ఏతా దశమహావిద్యాః సిద్ధవిద్యా ప్రకీర్తితాః**

ఇవి మహావిద్యలని చాముండాతంత్రం అంటోంది. విశ్వేశ్వర తంత్రం ప్రకారం – కాళి, తార మహామహాసిద్ధవిద్యలని, షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమావతి, మహాసిద్ధవిద్యలని, బగళా, మాతంగి, కమల సిద్ధమహావిద్యలని ఉంది. (చూ. Principles of Tantra 1.345 పుట) ఇలా కొన్ని తేడాలున్నాయి.

కొన్ని మార్గాలు వామమార్గానికి చెందాయని, కొన్ని దక్షిణమార్గానికి చెందాయని చెప్పడం సబబు కాదేమో! ఈ భేదం సాధకునికి చెందింది కాని, దేవతకు సంబంధించినది కాదు కదా! వామమార్గానికి కాళికి సంబంధం ఉండడం సబబుగానే ఉంటుంది. కాని ఆమెను దక్షిణమార్గంలో ఆరాధించకూడదని ఎక్కడా లేదు. లలితాసుందరిని రెండు

మార్గాలలోనూ అర్చించవచ్చని లలితా సహస్రనామాలలోనే ఉంది కదా! సవ్యాపసవ్య మార్గస్థా, దక్షిణాదక్షిణారాధ్యా అనే నామాలున్నాయి కదా! వీరారాధ్యా అని కూడా ఉంది.

కాళి సంహారశక్తికి ప్రతినిధిగా, సుందరి దివ్యానందానికి ప్రతినిధిగా కన్పిస్తుంది. నిజమే. కాళి కాలానికి చెందితే, సుందరి కూడా కాలానికి చెందిందే. చంద్రుని కళలు, తిథినిత్యలని ఆ కాలాన్ని సూచిస్తూ 'ప్రతిపన్ముఖ్యరాకాంతా' అనే నామం సుందరికి ఉంది కదా! పదిహేను కళలూ పదిహేను మంత్రాక్షరాలుగా ఈమె మంత్రంలో ఉంది కదా! ఈమె షోడశి కూడా. మహానిత్య. ఈ పదిహేను కళలకు బలాన్నిచ్చేది. కాళి శవం మీద నిలబడినట్టుంటే, త్రిపురసుందరి పంచప్రేతల మీద కూర్చుంటుంది. కాళి చండీరూపంలో ఉండి నవదుర్గలుగా అవతరిస్తే ఆమె మంత్రం కూడా నవాక్షరియే. సుందరి మంత్రంలో ప్రత్యేకమైన అక్షరాలు తొమ్మిదే. వచ్చిన వర్ణం మరల వస్తుంది. మరల వచ్చిన వాటిని తొలగిస్తే ప్రత్యేక అక్షరాలలో బిగించవచ్చు. అనగా 15-9 అవుతోంది.

కాళికి భయంకరరూపమే కాదు. భద్రకాళి రూపమూ ఉంది. త్రిపురసుందరి సుందరిగా కనబడినా, భయంకరరూపంలో త్రిపురభైరవిగానూ ఉంది. కాళి – ఆకలిని, మృత్యువును సూచిస్తే, సుందరి – దివ్యమైన కోరికను సూచిస్తుంది.

కనుక రెండు మార్గాలలోనూ పోలికలున్నాయి. అన్ని విద్యలనూ రెండు మార్గాలలోనూ అర్చించవచ్చు.

కాని అన్ని విద్యలూ ఒక్కటి కావు. అయితే భిన్నభిన్నంగా కనిపిస్తున్నా, ఐకమత్యం అనే సూత్రమూ ఉంది.

ఆపైన సాధకుని యొక్క మనోభావనకు, రుచికి తగ్గట్టుగా ఒకొక్క దేవతను ఉపాసిస్తాడు. అన్నీ పరమపదాన్ని చేర్చేవే. ఏ వంటకాన్ని ఆరగించినా తీర్చేది ఆకలే కదా! ఒక విద్యలో సిద్ధిని పొందినవాడు మరొక విద్యాస్వరూపాన్ని ఆకళింపు చేసుకోగలడు. సమన్వయాన్ని సాధించగలడు.

– ఇతి శమ్ –

# చివరి మాట

ఈ రచన ముగించిన తరువాత ఈ విద్యలకు – రామాయణానికి దగ్గర సంబంధం ఉన్నట్టనిపించింది. సీతమ్మ దశమహావిద్యారూపిణిగా తోచింది. బాలకాండలో బాలగా, స్త్రీయం పురుషవిగ్రహమంటూ రామయ్య నోటికే తాళం వేసిన సందర్భంలో బగళాముఖిగా, అశోకవనంలో ధూమావతిగా, లంకాదహన, యుద్ధ ప్రేరేపణలో త్రిపురభైరవిగా, యుద్ధ సమయంలో కాళిగా, కథ ఆది నుండి అంతం వరకూ వ్యాపించిన భువనేశ్వరిగా, మధురవాక్కులతో మాతంగిగా, పట్టాభిషేక సమయంలో కమలాత్మికగా, అడుగడుగునా త్రిపురసుందరిగా భాసించింది.

ఈ భావనకు – సుందరకాండకు దేవీతత్త్వపరంగా సుందరంగా వ్యాఖ్యానించిన మిత్రులు శ్రీ కాశీభొట్ల సత్యనారాయణగారు శుభాకాంక్షలనందించారు. కుర్తాళం పీఠాధిపతులు అభయహస్తం అందించారు. మరల రామాయణాన్ని ఆరాధించాలి. తంత్రగ్రంథాలను ఉపాసించాలి. అస్తు.

– రచయిత

# దశమహావిద్యలు

ఆగమాలు బోధించే మహావిద్యలు, నిగమాలు(వేదాలు) నుడివిన ఉపనిషల్లక్ష్యాన్ని సాధించే ఉపాసనా మార్గాలే. "ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీవిద్యా" అని లలితాసహస్రం పేర్కొన్నది. 'సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా' అని కూడా వక్కాణించింది. సిద్ధమైనది బ్రహ్మమే. మహావిద్యలకి సిద్ధవిద్యలని కూడా పేరు.

'దశ' సంఖ్య పూర్ణత్వానికి, ఏకత్వానికి, వ్యాపకత్వానికి సంకేతం. పది(10) అనే సంఖ్యలో బహుత్వ మున్నా, సున్నను తొలగించితే, (సున్నను కలిపినా) మిగిలేది ఏకత్వమే. ఈ అంతరార్థం దశమహావిద్యా విజ్ఞానం. వీటిలోని ఉపాసనా పద్ధతులు, మంత్రములు, దేవతా మూర్తులు,యంత్ర విశేషాలు... అన్నీ ఆత్మశక్తి విలసనాన్ని అవిష్కరించేవే.

ఈ ఆవిష్కరణను అద్భుతమైన దర్శనశక్తితో అవగాహన పరచిన **శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు** ఉపాసకులకు ఈ కృతి ద్వారా మహోపకృతి గావించారు.

సామవేదం షణ్ముఖశర్మ